# గురజాడ గురుత్వాకర్షణ

## పరిశీలనాత్మక వ్యాసావళి

డా॥ సోమసుందర్ ఆవంత్స

కళాకేళీ ప్రచురణలు
పిఠాపురం - 533 450

# గురజాడ గురుత్వాకర్షణ 40/-

సోమసుందర్ గ్రంథావళి క్రమసంఖ్య - 55

ప్రచురణ:

నవంబర్ 2000... 

ముద్రణ :

రాంషా-శిరీషా ప్రచురణలు
సామర్లకోట.

ప్రతులకు:

కళాకేళీ నికేతన్,
పిఠాపురం 5334౦౮.

**Sole Distributers: VISALANDHRA PUBLICATIONS,**
4-1-435,Vignanabhavan,
Bank Street, HYDERABAD -1

**సాహితీమూర్తుల పరిశీలనలు:**

1) శేషేంద్రజాలం 2) కృష్ణశాస్త్రి కవితాత్మ 3) రుధిర జ్యోతిర్దర్శనం
4) పురిపండా ఎత్తిన పులిపంజా
5) అమృతవర్షిణి (బాల గంగాధర తిలక్ కవిత్వంపై.)
6) అగ్ని వీణ ఆలాపించిన అణుసంగీతం (అనిసెట్టిపై)
7) జాతికి జ్ఞాననేత్రం (కొడవటి గంటి సాహిత్యంపై పరిశీలన)
8) నారాయణ చక్రం (సి.నా.రె కవిత్వంపై)
9) కృష్ణశాస్త్రి వెలిగించిన కార్తీక దీపాలు 10) ఈ గ్రంథం.

చివరి అట్ట :
గ్రంథకర్త ఫొటో-
శ్రీ పి. సుదర్శన్ నాగార్జునసాగర్

**వెల: నలభై రూపాయలు**

నా చిరకాల ప్రియమిత్రులు

నిడమర్తి ఉమారాజేశ్వరరావు, శ్రీమతి శ్యామలాదేవిగార్ల



ఏకైక కుమార్తె ఆకస్మిక దుర్మరణంపాలైన



శ్రీమతి భోగరాజు మాధవి స్మృతికి అంకితమిస్తూ...

# గ్రంథావతరణ

శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు, శ్రీమతి శ్యామలా దేవిగార్లు నాకు చిరకాలమిత్రులు. వీరి కుటుంబం జాతీయోద్యమంతో ముడిపడి జాతి అభివృద్ధికోసం సర్వకార్యక్రమాల్లోనూ ఉత్సాహంగా పాల్గొన్నవారు. పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లిగూడెం తాలూకా నిడమర్రు వీరి కుటుంబ చరిత్రతోనే స్వాతంత్ర్య సమర కేంద్రమయింది. వీరి తండ్రిగారు నిడమర్తి లక్ష్మీనారాయణగారు, జాతీయవాది. సర్వతోముఖ ప్రజాసేవకుడూను. గ్రంథాలయోద్యమ సంచాలకులుగా, కృష్ణా గోదావరి జిల్లాలో విరివిగా గ్రంథాలయాల స్థాపనకు కృషి చేశారు. తత్ఫలితంగా 'గ్రంథాలయరత్న'- బిరుదు కైవసం చేసుకున్నారు. జాతీయవాదిగా, సంఘ సంస్కరణ అభిలాషిగా, అటు సహకారోద్యమాన్నీ, ఇటు అస్పృశ్యతా నివారణోద్యమాన్నీ ఒక దశాబ్దిపాటు నిర్వహించి 1928లో చనిపోయారు.

శ్రీఉమారాజ్ అన్నగారు కమ్యూనిస్టు పార్టీ నిర్మాణ చరిత్ర ప్రథమ దశాబ్దంలోనే (35-45) సంవత్సరాల నడుమ ప్రఖ్యాతులైన నిడమూర్తి అశ్వనీ కుమారదత్తు. వారి ప్రభావంతోనే ఉమారాజ్ తన పదునాలుగవ యేట యువకమ్యూనిస్టుగా కృషి చేయనారంభించారు. కొండేపూడి లక్ష్మీనారాయణ, శ్రీనివాసరావు సోదరులు ఈ నిడమర్తి సోదరులకు మేనత్త గారి బిడ్డలే. 1939నుంచీ 48 వరకూ నిడమర్తి సోదరులు ప్రగతి ప్రచురణాలయం నడిపి ఎన్నో పుస్తకాలు ప్రచురించారు. గోర్కీ వంటి మహారచయితల గ్రంథాలను ప్రచురించారు. కర్నూలు జిల్లాలో 'ఫైర్ బ్రిక్, మరియూ పాటరీస్' అనే పరిశ్రమను 1950నుంచి 65వరకూ నిర్వహించారు.

ఉమారాజ్ మనసుకు సాహిత్యేతరమైన ఇటికల పరిశ్రమ నప్పలేదు. 1965లో దానినుంచి శాశ్వతంగా విముక్తమై, తదాదిగా విశాలాంధ్ర ప్రచురణాయం సంపాదకుడుగా రెండేళ్లు పనిచేశారు. ఆ ప్రచురణ సంస్థ మేడమీద నూరు సాహిత్య గోష్ఠులు నిర్వహించారు. మహీధర రామమోహనరావు వంటి భీష్మ పితామహులు ఆ గోష్ఠులలో ప్రతివారం పాల్గోనేవారు. క్రమంగా ఈ సమావేశాలు అభ్యుదయరచయితల సంఘం పునర్నిర్మాణానికి దోహదం చేశాయి. 1967నుంచి 1977 వరకూ విశాలాంధ్ర దిన పత్రిక ఆదివారం అనుబంధానికి సంపాదకులుగా పనిచేశారు. కృష్ణాజిల్లా అరసం ప్రధాన కార్యదర్శిగా 1970నుంచి 73వరకూ పనిచేశారు. ఆంధ్రప్రదేశ్ అరసం గుంటూరు మహాసభల్లో కోశాధికారిగా ఎన్నుకోబడి, మూడేళ్ళు పనిచేశారు. ఆఫ్రో ఆషియా రచయితల సంఘ ఆంధ్రశాఖకు కార్యదర్శిగా, కేంద్ర సంఘానికి కార్యవర్గ సభ్యులుగా, నేషనల్ కౌన్సిల్ సభ్యులుగా పనిచేశారు. ఆ సంఘ సహాయ కార్యదర్శి శ్రీ సుభాష్ ముఖోపాధ్యాయతో కలసి బాగ్దాదులో జరిగిన ఆ సంఘ ప్లీనరీ కాన్ఫరెన్సుకు 1976లో

ఇరాక్ వెళ్ళారు. 1977మేనుంచి 1992 ఫిబ్రవరి వరకూ మాస్కోలో తెలుగు అనువాదకులుగానూ, రష్యా తెలుగు నిఘంటు సంపాదకులుగానూ పనిచేశారు. మార్క్సిస్టు తత్త్వ శాస్త్రానికి సంబంధించినవీ, సాహిత్య గ్రంథాలూ, సామాజిక, ఆర్థిక, రాజకీయాది గ్రంథాలూ శతాధికంగా అనువదించారు. భారత కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రశాఖ విజయవాడలో జరిపిన స్వర్ణోత్సవ సభలో (1975 డిశెంబరు 26) సన్మానం అందుకున్నారు. ఆంధ్రప్రదేశ్ అరసం పన్నెండవ మహాసభ గుంటూరులో 1992లో జరిపినపుడు, అమరజీవి పులుపుల వెంకట శివయ్య సత్కారం పొందారు. అరసం స్వర్ణోత్సవ సందర్భంగా తెనాలిలో 1994మార్చిలో తుమ్మల వెంకటరామయ్య సువర్ణ పతాక సన్మానం పొందారు. ప్రస్తుతం బెంగుళూరులో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు.

(810 చిత్రపూర్ అపార్ట్స్; 15వ క్రాస్; 8వ మైన్; మల్లేశ్వరం, బెంగుళూర్-55 Ph: 3311549) బెంగుళూరు అరసంశాఖ విజయవంతంగా నిర్వర్తిస్తున్నారు. "మధ్యే మధ్యే" వీరి సాహిత్య వ్యాసాల సంపుటి.

వీరి జననం: 17-10-1923.

వీరికి మల్లికార్జున్ అనేకుమారుడు. అతడు మాస్కోలో స్థిరపడ్డాడు. కుమార్తె మాధవి. ఆమె 31-8-1964 తేదీన జన్మించింది.

విజయవాడ, మాస్కోలలో చదువుకుంది. 1981లో భారతదేశం తిరిగివచ్చిన తర్వాత 6-12-81వతేదీన బెంగుళూరులో శ్రీ భోగరాజు కాశీవిశ్వనాథ్ బి.టెక్ తో వివాహం జరిగింది. ప్రఖ్యాత రష్యన్ చిత్రకారుడు స్లైతస్లావ్ రేరిఖ్‌నుంచి రష్యన్ ఇంటర్‌ప్రెటర్ ఉద్యోగానికి ఆహ్వానం వచ్చినా, అదే సంవత్సరం పుత్ర జననం వల్ల వెళ్ళలేక పోయింది. 25-10-85న కుమారుడు ఆదిత్య జననం.

31-5-1991 పుత్రిక తూలిక జన్మించింది.

పెయింటింగ్ నేర్చుకుంది. చిత్రాలు రచించింది. ఇంగ్లీషు, రష్యన్, తెలుగు గ్రంథాలు విపరీతంగా అధ్యయనం చేసింది. 1992లో స్క్రీన్ ప్రింటింగ్ యూనిట్ ప్రారంభించింది.

1-12-1994వ తేదీన తల్లి తండ్రులతో కలిసి జనరల్ ఎలక్షన్స్‌లో ఓటువేయడానికి వెళ్ళింది. ఓటు వేసి, తండ్రితో "నేనొక స్నేహితురాల్ని చూసివస్తాను మీరు ఇంటికి వెళ్లండి" అని చెప్పి స్కూటరుమీద వెళ్ళింది. దారిలో ట్రాఫిక్ రెడ్‌లైటు వెలగడం వల్ల స్కూటరు ఆపి నిల్చుంది. ఆమె ముందు ఒక జీపు ఉంది. దానిలో ఆరుగురు మనుషులున్నారు. ఎడమప్రక్క ఇంటి ఆవరణలోని ఒక పచ్చని చెట్టు ఆకస్మికంగా కూలి జీపు మీదపడింది. దాని ఒక కొమ్మ బలంగా వచ్చి స్కూటరుమీద ఉన్న మాధవి పొట్టకు తగిలింది అంతే! నేలకూలిపోయింది. పోలీసులు ఆసుపత్రికి తీసుకెళ్ళారు.

ఆమె బ్యాగులోగల డైరీలో ఫోన్ నెంబరువెదికి, తండ్రిగారికి, భర్తకి ఫోన్‌చేశారు. భర్త వచ్చేసరికి వేరే పెద్ద ఆసుపత్రికి రోగిని తరలించారు. మాధవి కళ్ళెత్తి భర్తను చూసింది. తాను వెళ్ళిపోతున్నట్టు సంజ్ఞ చేసింది. తల్లీతండ్రీ వచ్చేలోపులోనే ప్రాణాలు విడిచింది. ఆమె ఎంతో స్నేహశీలి. ఎప్పుడు ఇతరులకు ఏ సహాయం కావలసి వచ్చినా అందించేది; ఏమైతేనేం, అకారణంగా, ఆకస్మిక దుర్ఘటన వల్ల చనిపోయిన మాధవి మృత దేహాన్ని సందర్శించడానికి ఐదారు వందలమంది మిత్రులు వచ్చారు.

నా మిత్రులు నిడమర్తి ఉమారాజ్ ఈ విషయాన్నంతా నాకు రాస్తే నేను మ్రాన్పడిపోయాను. విభ్రాంతి చెందాను. ఎనిమిదేళ్ళ వయసు పాపగా పరిచయమైన మాధవి నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడల్లా ఎంతో చనువుగా ఉండేది. ఆ మమకారంతో నేను నన్ను ఓదార్చు కుందుకే ఈ గ్రంథాన్ని ఆమె సంస్మరణార్థం అంకితమిస్తానంటూ నా మిత్రులకు సాను తాపలేఖ రాసినపుడు చెప్పాను.

1991 సెప్టెంబరు 17న నాకు తెలుగు విశ్వవిద్యాలయం అప్పటి వైస్ ఛాన్సిలర్ శ్రీ సి. నారాయణరెడ్డి గారి ఆధ్వర్యవంలో నాకు డాక్టరేటు ఇచ్చి సత్కరించింది. ఆ సందర్భంగా జరిగిన అసంఖ్యాక సన్మానాలలో కన్యాశుల్కం గురించి శత జయంతి సందర్భంగా నేను ఉపన్యాసాలిచ్చాను. ఎన్నో విద్యాసంస్థలూ, సాహితీ సంస్థలూ ఆహ్వానించి సత్కరించాయి. కన్యాశుల్కం, గురజాడ అవతరణల గురించిన నా ఉపన్యాసాలను సాహిత్యాభిమానులు ఎంతో శ్రద్ధగా విన్నారు. ఆ కాలంలో దాదాపు మూడు సంవత్సరాలు నేను రాసిన ఈ వ్యాసాలను పత్రికలు ప్రచురించాయి. ఆ వ్యాసాలను ఈ గ్రంథంగా 'గురజాడ గురుత్వాకర్షణ' అనే శీర్షికతో నా పాఠకులకు అందజేస్తున్నాను. ఈ వ్యాసాల రచనా సందర్భంలోనే "ది ఎలెవెన్ కాజెస్ ఫర్‌ది డీజెనరేషన్ ఆఫ్ ఇండియా" అనే అంశంపై పూనా డెక్కన్ కాలేజీలో గిరీశం ఉపన్యసించానని చెప్పుకున్న అంశం గురించి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి బళ్ళారి టి. రాఘవ చేత Extensive లెక్చరు రాజమండ్రి ట్రైనింగు కాలేజిలో ఏర్పాటు చేసిన భోగట్టాను, ఆ ఉపన్యాస ప్రతినీ మాన్యమిత్రులు శ్రీ జనమంచి కామేశ్వరరావు సంపాదించి ఇవ్వగా దానిని అనువాదం చేయడమూ- కన్యాశుల్కం శతజయంతి పునస్సమాలోచనలోనే బయటపడింది. ఇప్పుడీ గ్రంథాన్ని ఈ రూపంగా వెలువర్చడానికి మిత్రులు ఉమారాజ్, ముద్రణాదికాలలో శ్రద్ధచూపిన డా॥ పూషా, నామిత్రుడు శ్రీ కొత్త నూకరాజుగార్లకి కృతజ్ఞత లందజేస్తున్నాను. నా డబ్భైయ్యేడవ జన్మదిన సందర్భంగా (18-11-2000) నా ప్రియ పాఠకులకందరికీ శుభాశంసలందిస్తూ

**6-11-2000.**
**కళాకేళీపప్రచురణ**
**పిఠాపురం.**

**భవదీయ**
**సోమసుందర్**

# 1. ఆధునిక యోచనాధారకు జనకుడు గురజాడ అప్పారావే

ఇరవయ్యో శతాబ్దం ఆరంభమయ్యేనాటికి వైజ్ఞానిక శాస్త్రరంగం ఎన్నో విజయాలను సాధించింది. ఆ విజయాల ప్రభావం సాహిత్య స్వరూప స్వభాలనూ మార్చివేసింది. ఆధునిక భావ ధారను సంసిద్ధ మొనరించింది. సర్వకాలాల, సర్వదేశాల సమస్యలనూ పరిష్కరించుకోగల నిర్దిష్ట మార్గాలను ఉపదేశించింది.

దీనితో ఆధునికతా ప్రభావానకి లోను కాని గతానుగతికత్వం పూర్తిగా తొలగిపోయిందని అర్థంకాదు. ఇరవయ్యో శతాబ్దంలో పుట్టినంత మాత్రంలో సమకాలీన సాహిత్యమంతా ఆధునిక వివేచనా బద్ధమని చెప్పడానికి వీలులేదు. ఆధునికత నిర్వచనానికి లోబడేదంతా ఈ శతాబ్దపు వైజ్ఞానిక శాస్త్రప్రభావ జన్యమేననీ వక్కాణించలేము. వేమనయోగి వంటి మేరునగధీరులు పదిహేడో శతాబ్దంలో జన్మించినా ఆధునిక వివేచనకు ప్రాణ స్పందన కలిగించిన వారేననడంలోనూ సంశయమక్కరలేదు.

ఆధునిక వైజ్ఞానిక శాస్త్రవిజయాలు మేధావుల ఆలోచనా మార్గాలకు వివేచనా కరదీపాలు సంతరించాయి. వాటి ఆసరాతో ప్రయోగవాద సాహసం పెంపొందింది. ఈ వినూత్న ప్రభావబద్ధమైన సాహిత్యాన్నే మనం ఆధునిక సాహిత్యమని పేర్కొన వలసివచ్చినది. ఈ ఆధునిక స్వరూపంతో స్వభావ గర్భితమైన ప్రక్రియా విశేషాలన్నీ గుణాత్మక ప్రాధాన్యతతో విశ్లేషించుకోవలసి ఉంది.

కాని మనవిశ్వవిద్యాలయ పండితులు రొడ్డకొట్టుడు వైఖరి అవలంబిస్తున్నారు. ఈ శతాబ్దికి చెందిన సకల ప్రక్రియలనూ గుడ్డెద్దువాటంగా ఆధునిక సాహిత్యమని ముద్రగుద్దు తున్నారు. పూర్వయుగావశేషాలుగా నేటికీ వెలువడుతున్న సంప్రదాయబద్ధ సాహితీ ప్రక్రియలన్నిటినీ ఆధునికంగా చెలామణీ చేయడం దురదృష్టకరమే! ఆదునిక పదాన్ని కాలవాచిగా భ్రమించి విచక్షణా రహితంగా చేసే కంగాళీ తప్ప విశ్లేషణకాదు.

సర్వజీవన రంగాలలోనూ స్థితికీ గతికీ నడుమగల వైరుధ్యాన్ని వింగడించుకోవడం ఆధునిక వైజ్ఞానిక శాస్త్రంచేకూర్చిన ప్రాణధాతువు! సకలాంశాలలోనూ పరిణామాన్నీ ప్రయోగాన్నీ నిర్ధారిస్తూ సాగే సాహిత్యం మాత్రమే ఆధునికమని మనం కేటాయించుకోవాలి. ఏ సంప్రదాయాన్ని కాని, ఆచారాన్ని కాని కిమ్మనకుండా ఆధునిక యోచన ఆమోదించదు. గతానుగతికత్వం దానికసలే సరిపడదు. అది కాంతిమయ

ఆవరణను కేవల స్వరూపానికో, స్వభావానికో పరిమితం చేసుకోదు.

ఈ సకల లక్షణ లక్షితమైన ఆధునిక కవిత్వం తెలుగులో ఏదో ఎప్పుడు ప్రాదుర్భవించిందో పోల్చుకునేందుకు మనం ధనధ్రువం పట్లనే దృష్టిని లగ్నం చేయాలి.

తెలుగు కవిత్వంలో సర్వాత్మనా ఆధునిక లక్షణాభివ్యక్తి ప్రపథమంగా 1910లో అవతరించింది, అది మహాకవి గురజాడ అప్పారావుగారి "గుత్తునాముత్యాలసరములు కూర్చుకొని తేటైనమాటలు" అనే గేయంతోనే ప్రారంభమైంది. దీనితోనే ప్రప్రథమంగా ఉత్తమ పురుషైక వచనమూ దర్శనమిచ్చింది. ఇది ఆధునిక కవితా లక్షణమేనని విస్పష్టంగా వాకొనవచ్చు. కవిత్వంలో "నేను" ప్రయోగంగురించి వివరిస్తూ స్టూవర్ట్ హేమ్స్పైర్ అనే ఆంగ్ల విమర్శకుడు చక్కని సూత్రీకరణ చేశాడు.

"సాహిత్య సంబంధమైన ఈ అహమిక ద్రవస్థితిలోని వ్యక్తిత్వానికి అభివ్యక్తి సాధనమే. రచయిత తాలుకు వ్యక్తిగత అహమికతో దీనికి ప్రమేయం లేదు. ఇది ఒక జీవనరీతికి ప్రతినిధి మాత్రమే. స్మృతులను, అభిదలను, ఉపదలను సాహిత్యపరంగా ప్రస్ఫుటీకరించుకునేందుకే ఈ అహమిక సహకరిస్తుంది. ఈ ద్రవరూప అహమిక సంఘటనల గొలుసుకట్టులో పరిస్థితుల కేంద్రీకరణలో అపూర్వశక్తిగా తేలుతూ కనిపిస్తుంది. ప్రతి సన్నివేశం పైనా దాని ప్రభావం ప్రసరిస్తుంది". అంటూ వివరిస్తాడు.

హేతు బద్ధమైన ఆలోచనలను భూమికగా గ్రహించి గురజాడ ప్రారంభించిన మానవీయ కవిత్వంలోనే ప్రప్రథమంగా ప్రవేశించిన ఈ అహమిక పెరిగి విరిగింది. సామూహికార్థానికి పర్యాయపదంగానే భాసిస్తుంది. ద్రవరూప సమాజవాహినికి అభిదగా స్వీకృతమైంది. గురజాడ ముత్యాలసరాల ప్రారంభమే సంకుచిత కులతత్త్వాలకు వ్యతిరేకంగా స్ఫూర్తి పొందింది. బరంపురంలో బయ్యా నృసింహేశ్వర శర్మగారి ఆధ్వర్యవంలో జరిగిన నానావర్ణ ఏకపంక్తి భోజనవిందు ప్రసక్తితో ప్రారంభం అయింది. స్థితికీ, గతికీ నడుమసాగే సంఘర్షణల సైతం రికార్డు చేసింది.

ఇది గురజాడ చైతన్యధార నుంచి ఉద్భూతమైనదే తప్ప యాదృచ్ఛికమెంత మాత్రంకాదు. మహాకవి రచించిన ముత్యాలసరాలు అల్పసంఖ్యాకమే. గుణప్రధానంగా అమేయశక్తి సంపన్నాలు. వాటిలో ప్రధానంగా ఐదుప్రముఖ జీవిత లక్షణాలు ద్యోతకం అవుతాయి. వెయ్యేళ్ళ మన సాహిత్యంలోనే ప్రథమశః అవి ప్రాతినిధ్యం వహించాయి.

(1) సమకాలీన సామాజిక స్పృహను కవిత్వంలో ప్రతిబింబించడం;

(2) జడీమయ సమాజానికి కవితా సంస్కారంతో చైతన్యం కలిగించడం

(3) ఖండ కావ్య స్వరూపంలో మొట్ట మొదటగా గేయాన్ని ఆవిష్కరించడం, దానితో ప్రజలదైన జానపదగేయ రీతికి సాహిత్యంలో అగ్రపీఠి కలిగించడం,

(4) ఆత్మాశ్రయ ప్రేమకవిత్వాన్ని ప్రారంభం చేయడం

(5) సంఘ సంస్కరణస్ఫూరిత భావాలకు, మానవీయ అనుబంధాలకూ ప్రాణ స్పందన కలిగించడం. ఈ ఐదు ప్రధాన లక్షణాలూ అపూర్వంగా ఓ జస్స్వాంతమయ్యాయి. తెలుగు కవిత్వంలోనే ఇవి ఆధునికతకు ప్రాణ లక్షణాలుగా ప్రతిష్ఠితమయ్యాయి. మొత్తం ఈ శతాబ్దాన్నే పురోగమింపచేశాయి.

**వర్జీనియా ఊల్ఫ్ విశ్లేషణ:-**

"ఆధునిక మేధావి, మహారచయిత్రి వర్జీనియా ఊల్ఫ్ 1924లో గొప్ప విశ్లేషణ జరిపింది. ఆంగ్లసాహిత్యంలో ఆధునికత ప్రవేశించి కాలాన్ని విస్పష్టం చేసింది. ప్రప్రథమంగా 1910లో ఆంగ్ల సాహిత్యంలో ఆధునికత ప్రబుద్ధమైంది. వస్తువు సంవిధానాల విషయంలో ఇది విస్పష్టమైంది. యజమానులకు, సేవకులకు గల సంబంధాలన్నిటా విస్పష్టంగా కలిగిన మార్పులను సాహిత్యం ప్రతిబింబించడం 1910లోనే జరిగింది. మానవ సంబంధాలలో మార్పు వచ్చినప్పుడే మతంలోనూ మార్పువస్తుంది. సాహితీ ప్రక్రియలలోసైతం ఈ మార్పు తన సజీవ ప్రభావం పొదుకొల్పుతుంది. విలువలన్నీ తారుమారవుతాయి". అంటూ ఉద్ఘాటించిందామె!

ఈ విశ్లేషణ వెలువడడానికి దాదాపు పదేళ్ళు ముందుగానే గురజాడ మహాకవి కన్నుమూశారు. కాని క్రాంతదర్శిగా ఆయన మానవ సంబంధాల పునర్మూల్యాంకాన్ని ప్రతిపాదించారు.

1. "మగడు వేల్పన పాతమాటది, ప్రాణమిత్రుడ నీకు, నీనెనరు కలుగక నేను పేదను, కలిగినను నా పదవి వేల్పుల రేనికెక్కడ?

2. ప్రేమనిచ్చిన ప్రేమ వచ్చును - ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును.

3. సతుల సౌరను కమల వనముకు సతుల ప్రేమయే వెలుగు, ప్రేమవిద్యకు వోనమాలివి.

4. ప్రేమ పెన్నిధిగాని, ఇంటను నేర్పరీ కళ ఒజ్జలెవ్వరు లేరు., శాస్త్రములిందు కూరిచి తాల్చె మౌనము, నేను నేర్చితి బాగ్యవశమున, కవుల కృపగని హృదయమెల్లను నించినాడను.,

5. యెల్ల లోకములొక్కయిల్లై వర్ణ బేధములెల్ల మాసిపోవును. జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును. అంత స్వర్గ సుఖమ్ములన్నవి అవని విలసిల్లున్! "-దానికి తన కవిత ద్వారా తొలుతగా ప్రయత్నించి ఆధునికత్వాన్ని నెలకొల్పారు.

పైన ఉల్లేఖించిన వర్జీనియా ఊల్ఫ్ సూత్రీకరణను కొద్దిమంది మత ఛాందసులైన

కేథలిక్కులు తప్ప ఆంగ్ల సాహితీ పరులూ, విమర్శకులూ సార్వత్రికంగా ఆమోదించారు. ఇంతముందుచూపుతోనూ మన మహాకవి ఆధునిక సామాజిక చేతనతోనూ తెలుగు కవిత్వంలోనూ, నవ జీవనాంకురాలు ప్రోది చేశాడు. అంతర్జాతీయ చారిత్రక సంఘటనగా తొలిముత్యాల సరంలోనే తోకచుక్క కేతువు కాదని, "వేల్పు లలనలు కేలివెలతొగ" మాత్రమేనని 'చనిన కాలపు చిన్న బుద్ధులు బెదిరియెంచిరి కీడుగా'ననీ ఉద్ఘాటించారు. ఎప్పుడు ఏర్పడిన దురంతమో మనసమాజములోని అట్టడుగు మెట్టుగా బరువులన్నీ మోస్తున్నవారిని మానవత్వం లేకుండా అస్పృశ్యులుగా వెలివేయడాన్ని సైతం ఆ మహాకవి నిరసించారు.

లవణరాజుకల అనే అద్భుత కావ్యంలో - మంచి చెడ్డలు మనుజులందున యెంచి చూడగ, రెండెకులములు; "మంచి యన్నది మాలయైతే, మాలనే అగుదున్!" అంటూ పుడమినేలే రాజుముఖతా అనిపించి సంఘపునర్నిర్మాణదీక్షలో ఎంతో ముందుకు సాగారు. ఇన్ని దశాబ్దాలు గడిచినా మన భూస్వామ్యవర్గం ఈ చైతన్యంలో లవలేశాన్నీ గ్రహించినా పాదిరి కుప్పం, కారంచేడు దుర్మార్గాలు జరిగి ఉండేవే కాదు!

"ఆకులందున అణిగి మణిగీ కవిత కోకిల పలకవలెనోయ్ పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తవలెనోయ్!" అన్న కవితోక్తిలో ఎంతో గాంభీర్యాన్ని నిక్షిప్తం చేసారు. ఉన్న యథార్థస్థితిని వ్యాఖ్యానించడమే ఆధునిక కవితా ప్రయోజనం కాదని దాని గతిని సంపూర్ణంగా, సచేతనంగా మార్చడమే ధ్యేయమని విశ్వసించాడు. తత్పూర్వ సాహిత్యంలో బలంగా పాతుకొని ఉన్న విలువలన్నిటినీ పరాస్తం చేసాడాయన. తత్పూర్వ స్థితి నుండి తారుమారైన మానవాను బంధాలు, నైతిక మూల్యాలు, రోజువారీ విలువలు తమ ఉనికి పట్లను కోల్పోవలసి వచ్చింది.

నూత్న సామాజిక ప్రతిబింబాలు సాహిత్యంలో నె. ంల్పబడ్డాయి. గురజాడ వెనువెంటనే రాయప్రోలు, బసవరాజు, అబ్బూరి కవుల ద్వారా వచ్చిన భావ కవిత్వం మరింత వేగవంతంగా సాహితీ సంస్కరణకి పూనుకొన్నది. ఆత్మాశ్రయ హృదయ వేదనల నెపంపై కవుల స్వీయాత్మక హృదయావేదనలే కాక సామాజిక శ్రేణుల విషాదానికి సైతం ప్రాతినిధ్యంగా అభివక్తమైంది.

**మహాకవి వారసత్వం:-**

గురజాడ మహాకవి కన్నుమూసిన పదిహేనేళ్ళకు ఆయన నెలకొల్పిన వారసత్వాన్ని సంపూర్ణంగా అందుకుని ఆధునికతను కలిగించారు మనకవులు. అంతేకాదు కవితాధర్మానికి ప్రగతి శీలాన్ని సంఘటింపచేశారు. శిష్ట్లా ఉమామహేశ, పురిపండా

అప్పలస్వామి, శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు అనె నాలుగు ముఖాల ద్వారా ప్రపంచాగ్ని తెలుగుదేశానికి అందివచ్చింది. విప్లవాత్మకంగా సమాజాన్ని మార్చడానికి నూత్న మానవీయ శక్తులకు ఆహ్వానం అందించబడింది.

మన ఆధునిక కవిత్వంలో సమాజ హృదయాన్ని సన్నిహితంగా చిత్రించడం ద్వారా వాస్తవిక రచనా విధానం ఈ నలుగురు కవుల ద్వారానే ఆవిష్కృతమైంది. సందేశాత్మకతను సద్యస్ఫోరకం చేసింది. కవితాకల్పనా దక్షమూ, శిల్పమూర్తి నిక్షేపమూ అగు పదచిత్రవాదాన్ని ప్రథమశః శ్రీరంగం నారాయణబాబు ఉద్దీప్తం చేసినా, ప్రాహ్లాద కవీత్వమంటూ ధనపూంజీవావాన్ని హిరణ్యాకాశ్యపమని పేర్కొంటూ ముక్తచ్ఛంద కవితకు శిష్ట్లా ఉమామహేశ ప్రారంభకుడైనా, తీవ్రవాద దేశభక్తికి పురిపండా అప్పల స్వామి ఆద్యు లయినా, అందరినీ అదఃకరించి మొగదార్లై శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు) ఈ దశకం నుంచే యిదే కవితాస్వరూపంగా పురోగమింపచేశాడు. ఈ ధోరణులు రెండింటికీ సమాన దర్మంగా, ప్రస్ఫుట సంవిధాన మర్మంగా ప్రతీకవాదం (Symbolism) ప్రవర్థితమవుతోంది.

ఈ శతాబ్దపు నాల్గవ దశాబ్ది పొడుగునా పరిఢవిల్లిన వాస్తవికవాదకవులు - ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, పిలకా గణపతి శాస్త్రి, పఠాభి, పిఠాపురం యువరాజా, పాలగుమ్మి పద్మరాజు, సింగరాచార్య, పూషా మున్నగువారు ఆధునిక భావధారను పోషించినవారే. భావ కవులలో ముందు సంప్రదాయ కవితారీతికి తలఒగ్గి వెనక్కి వెళ్ళిపోయారు. అలాగే ముప్పయిలలో ఉప్పతిల్లిన ఆధునిక కవులు సైతం దైవభీతితో సంప్రదాయ భీతితో కట్టడి చేయగా వెనుదిరిగి సంప్రదాయవాదులై పోయారు. పాప ప్రక్షణార్థం పద్యకావ్యాలు రాసుకుంటూ మందిలో కలిసిపోయారు.

శ్రోత్రియబుద్ధి జాడ్య జనితోన్మాదాన్ని దుళ్ళగొట్టి-గురజాడను వాల్మీకిగా ప్రస్తు తించిన ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి సైతం పద్యకావ్యాలు రచించి సంప్రదాయవాదుల గుంపులో కలిసి పోయారు. వాల్మీకి అనడంలో ఆయన నిర్దేశించిన భావం-ఆధునిక కవితకు గురజాడ ఆద్యుడని స్పష్టం చేయడమే! "మహాకవీ జహాపనా! మొయలేమయ్యా పల్లకి, మొగమాటం దేనికీ?'' అనీ 'ఉపనీషద్వీధిలో ఊరేగు దేవా ఉర్విదౌర్జన్యాల కూరుకున్నావా?' అనీ ఒకనాడు విప్లవ కంఠం వినిపించిన యీకవి ద్రాక్షారామ భీమేశు శరణుజొచ్చాడు.

కవి హృదయంలో హేతువాదవిచికిత్స ప్రారంభమైతే-మతబద్ధ పరిసరాల ప్రాబల్యాన్ని ప్రశ్నించకుండా ఊరుకోదు. దేవుని అస్తిత్వాన్ని సవాలు చేయకనూ విడువదు. అందుకే 'కొండశిఖరాలపై కొలువు కూర్చుండి కూటిపేదల ముడుపు గుంజుతున్నావా?' అని ప్రశ్నించాడు ఇంద్రగంటి. ఆనాటి యువ హృదయాలలో మోసులు వారుతున్న

కొత్త చూపునీ, కొత్త ఆశనీ విప్లవాత్మక ఆవేశాలన్నీ ముప్పయిల దశకంలోని కవులు చిత్తశుద్ధితో ప్రతిధ్వనించారు. "ప్రతి హృదయంలో, ప్రతి సదనంలో జ్వాలలు రగిలించని, జ్యోతులు వెలిగించని" పాటలు పనికిరావని ఆదేశించారు. ఒక ఉజ్జ్వల చారిత్రక ఘట్టానికి తెరదీశారు.

## అభ్యుదయ సాహిత్య మహాయుగం:-

ముప్పయిల దశాబ్దం అంతరిస్తున్న వత్సరాలలో శ్రీశ్రీ ప్రయోగవాదాల వైపు మళ్ళాడు. ముఖ్యంగా అధి వాస్తవిక వాదమూ, అస్తిత్వవాదమూ వంటి సాహిత్యవాదాలలో ప్రయోగాలకు మోజుపడ్డాడు. ఆ దశాబ్ది ఆరంభంలో అతను ప్రభావితం చేసిన విప్లవ కవితాభిముఖంగా నూత్నకవితలు విరచించడం మానుకున్నాడు. "కవిత్వ మార్గాలకు శ్రీశ్రీ అంతత్వరగా స్పందించి ప్రయోగాలు జరిపిన కవులు చాలా అరుదుగానే కనిపిస్తారు" అన్న విమర్శకుని అంచనా అర్థసత్యం మాత్రమే. శ్రీశ్రీ స్వీకరించిన పరాసుదేశ కవితా మార్గాలలోని నవ్యతకే మోజుపడ్డాడు. తప్పితే భవ్యత గురించి దర్శించలేకపోయాడు. శ్రీశ్రీ పై ఎంత భక్తిఉన్నా - విమర్శకుల సత్యసందర్శనానికది గంతలు కట్టరాదు. శ్రీశ్రీ కవిత్వం ఆకాశ మార్గాలలోంచి హడావుడిగా వెళ్ళిపోతూ శ్రామిక జనక్లేశాలను దూర బంధువుగా వీక్షిస్తే తదనంతరం ప్రభవించిన అభ్యుదయ కవులు నేలమీదకి దిగారు. శ్రామిక జనశ్రేణులతో బుజంబుజం రాసుకుంటూ సాగారు. వారు కూటికోసం, కూలీకోసం, బానిసత్వ విముక్తి కోసం చేస్తున్న పోరాటాలకు ఆంతరంగిక విస్ఫూర్తి నందించారు.

అభ్యుదయ కవిత్వానికి సమీప మార్గదర్శి శ్రీశ్రీయే! కాని పితామహుడు మాత్రం గురజాడ! ప్రపితామహుడు వేమన్న "మీ బాధలు మీగాధలు అవగాహన నాకవుతాయి". అని విశ్వసనీయంగా పలికిన శ్రీశ్రీ - తెలంగాణా సాయుధ పోరాట చరిత్రలో తనగొంతు కలపలేకపోయాడు. లక్షలాది దీన, హీన ప్రజల రక్తమాంసాలతో బలుస్తున్న నైజాం రాక్షస కొలువులో అప్పుడు ఉద్యోగం నెరుపుతున్నాడు. అలాగే రాయప్రోలు కూడా - ఒకనాడు ఆంధ్రుల ఉజ్జ్వల చరిత్రను గానం చేసిచేసి " కంకణ విసర్జన కిదికాలమగునె"? అని ప్రశ్నించి ప్రజలలో చైతన్యమందించిన కవి కూడా జనహంతకుడైన నైజాంను కీర్తిస్తూ 'ఆదర్శప్రభువు' అనే గ్రంథం ప్రచురించి తెలుగుజాతిని శాశ్వతంగా అవమానపరిచాడు. కవుల అంతర్గత వైరుధ్యాలు తమ చరిత్రలనే భంగపరచగలవు కాని, ప్రజల చరిత్ర గతిని భ్రంశ మొనర్చలేవు!

అణుశక్తిని శాంతియుత ప్రయోజనాలకు వినియోగించుకుంటున్న యుగంలో సైతం - కుండలూ ఉంటాయి; కొత్త రాతియుగానికి చెందిన రాచ్చిప్పలూ ఉంటాయి.

అలాగే అభ్యుదయ సాహితీ యుగంలో సైతం - సమన్వయ వాదులూ ఉంటారు; అభ్యుదయ నిరోధకులూ ఉంటారు. రాజ్యహింసలకు కొమ్ముకాసేవారూ ఉంటారు. వారినెవ్వరినీ చరిత్ర లక్ష్యంచేయదు. కులవర్ణ వ్యవస్థలను తిరస్కరించిన మహాకవి గురజాడ తర్వాత వచ్చిన వారిలోనే కులవ్యవస్థలను సమర్థించే కవులు పేట్రేగడం మన మెరగనిది కాదు.

అభ్యుదయ కవితా మహాయుగం అందించిన శ్రామిక వర్గానుకూల శాస్త్రీయ సామ్యవాద విప్లవ భావధారకూ - 1960ల నాటికే వ్యాపార వ్యాప్తిలో సాగుతున్న కుక్షింభర బూతు సాహిత్యానికి పుట్టిన వికృతశిశువుగా దిగంబర కవిత్వం విజృంభించింది. చరిత్రగతిలో అది అదృష్టమో, దురదృష్టమో గాని - విప్లవ కవిత్వం విరసం పుట్టుకకు అదే దారి తీసింది. తదుపరి కాలంలో దాని చరిత్ర ఎన్ని పాయలుగానో విడిపోయింది. శోచనీయస్థితి ఏమంటే - ప్రతి ఒక్కపాయా రెండో దానితో సాయుధ సమరం కావిస్తోంది.

ప్రాయకంగా అభ్యుదయ సాహిత్యోద్యమం అందించిన శ్రామిక వర్గానుకూల శాస్త్రీయ సామ్యవాద భావధార నుంచి ఉద్భూతమైన వారసులే విరసంగాని, స్త్రీ వాదకవిత్వం గాని, నేడు ప్రచురితమవుతుంది.

దళితవాద కవితోద్యమం గాని! అభ్యుదయ సాహిత్యోద్యమమే ప్రథమంగా పీడితులను శృంఖలావిచ్ఛేద మొనర్చింది. కవుల ఆలోచనలకున్న ఇనుప సంకెళ్ళను పటాపంచలోనర్చింది.

నేడు కొందరు విమర్శకులు వాపోతున్నట్లు-కవిత్వం పల్చబడుతోందన్న ఆరోపణల వంటివి పూర్తిగా తెలిసి చేసినవీకావు; మూఢవిశ్వాసాల అనూహ్య బంధాలను తెంపుకుని చేసినవీ కావు.

ఏమైనా నేటి యువకవులు స్థిమిత బుద్ధులై కవిత్వం ఉత్తమోత్తమ కళ అనే సత్యానికి బద్ధులై కృషి సల్పాలి. అప్పుడే ఆగామి శతాబ్దానికి ఉత్తమ వారసత్వాన్ని అందించిన వారవుతారు. కవితామృత కలశాన్ని అందించినవారూ అవుతారు. అదే గురజాడ వారసత్వం.

"Art can sublimate the youthful anxieties the negative, accomplishment channalizes the emotions" అనే సత్యాన్ని కవితా కళారారాధకులందరూ శిరసా వహించడం క్రాంతిప్రదమవుతుంది.

**(ఆంధ్రప్రదేశ్ -జూన్ 1998)**

## 2. ఆధునిక కవితా శుభోదయం: మహాకవి గురజాడ

18వ శతాబ్దం ప్రారంభం నుంచీ తెలుగు సాహిత్యంలో ఒక జడత్వం వ్యాపించింది.

ఈస్ట్ ఇండియా కంపెనీ నిలదొక్కుకుని స్వదేశీ రాజవంశాలను తోలుబొమ్మలుగా మార్చి ఆడనారంభించింది. దేశీయపాలకులలో అంతఃకలహాలు కల్పించింది. పరస్పర కలహాలతో వీగిపోతున్న రాజరికాలను రద్దుచేసి తమ వలస భూభాగంలో కలిపేసుకుంటూ జమీందారులను నిర్వీర్యులుగా మార్చింది. కంపెనీ ప్రభువులందించే మనోవర్తి భరణాలందుకుంటూ జమీందార్లు భోగలాలసులయ్యారు.

ఈ పరిస్థితుల్లో దేశీయ మేధావుల మనస్సులు శిలీభవించాయి. కింకర్తవ్యాతా విమూఢత వ్యాపించింది.

కవులు పట్టాడిన పిందెలయి రాలి పోయారు. రాకాసి పాదాలక్రింద నలిగిపోజొచ్చారు. జాగృతీ చైతన్యాలు అంతరించాయి. కవులు బిచ్చగాళ్లవలె సంచార జీవులయ్యారు. తమకెదురైన ఒక ఛోటా జమీందారును లేక భూస్వామిని ఆశ్రయించ నారంభించారు. అతడినే మహానుభావుడనీ, మండలాధీశ్వరుడనీ వ్యర్థస్తుతులతో కాలం గడపనారంభించారు.

కవికి సంకల్ప వికల్పశక్తి ఉందన్న విషయమే మరిచిపోయారు. కుసంస్కార హృదయుడైన జమీందారు నీచాభిరుచికి రంజన కలిగిస్తూ నీచ శృంగార కావ్యాలు రచించనారంభించారు. వంధిమాగధులుగా తమరూపు మార్చుకున్నారు. మంది, అత్యధిక సంఖ్యాకులు నిరక్షరకుక్షులు, నిత్యదరిద్రులు. వారికి, కవులూ కవిత్వాలు పరాయి దినుసులై పోయాయి.

ఎంత గుణహీనుడైన పాలకుడైనా శ్రీరామచంద్రుడనో, శ్రీకృష్ణదేవుడనో ఉత్ప్రేక్షించి కుక్షింభరులు కాక తప్పలేదు. కవులు సునాయాసంగా ఈ బానిసబుద్ధికి దిగజారడానికి ప్రధాన కారణం "నా విష్ణుః పృధ్వీపతిః" అన్న అసత్య సిద్ధాంతం ఆసరాగా నిలిచింది.

పదిమంది గూండా ముష్కరులను వెంట తిప్పుకోగల వాడెల్లా పృధ్వీపతిగా కీర్తింపబడడం పరిపాటిగా మారిపోయింది. ఈదశలోనే కవులు తమకెదురైన రాజును-వీరభోగ వసంత రాయుడుగా భ్రమించి పచ్చిబూతుల బుంగను శృంగారసంగా సంతర్పణ చేయనారంభించారు.

"ఏ కోరసః శృంగారమేవః!" అనే తప్పుడు సిద్ధాంతం రచ్చకెక్కింది. అదే అలిఖిత శాశనమై కవులకు సర్వధా ఆరాధ్యమైంది. దీనికి నిరసనగా, విరుగుడుగా వేరొకప్రక్క భక్తి తత్పరత పెరిగి, కవుల సామాజిక సమస్యలను తిరస్కరించనారంభించారు. అదే ప్రధాన సాహిత్య వాహికగా ఎన్నుకొన్న కవులు శతకాలు నిర్మించుకుంటూ ఆముష్మికం సాధించుకున్నట్లు భ్రాంతి చెందారు. బాహ్య వాస్తవికతలోని క్లేశాలనుంచి తరించడానికి వాగ్గేయకారులు భక్తి ఒక్కటే తెప్పగా విశ్వసించారు.

ప్రతి మండలాధిపతీ విష్ణుశక్తి సంభూతుడే కనక-వాగ్గేయకారుల భక్తిప్రపత్తులు పరోక్షంగా వారికీ జమ అవుతూనే వచ్చాయి. విశిష్టాద్వైతంలో "తవ భృత్యస్యభృత్యః" అనే ప్రపత్తి ధర్మం-బానిసత్వాన్ని ఉత్తమ ధర్మంగా తలకెత్తుకుంది.

ఆ పరిస్థితులలోనే దుర్భరక్లేశాలు, అంతులేని అశాంతీ ప్రజాజీవితాన్ని కలవరపరిచాయి. వీటి ఫలితంగానే 1855లో ప్రథమ స్వాతంత్ర్య పోరాటం చెలరేగింది. సిపాయిల తిరుగుబాటుగా ఏలికలు దాని సహజగుణాన్ని కుంచించారు. కానీ ఈ స్వాతంత్ర్య పోరాటంలో పునాదుల కదిలించిన ఈస్టుఇండియా కంపెనీ భారతదేశం వంటి వలసను పాలించడం దుస్సాధ్యమవుతుందనుకుంది. బ్రిటీష్ సామ్రాజ్య అంతర్భాగంగా మార్చింది. తత్ఫలితంగా, విక్టోరియా రాణి సింహాసనం అధిరోహించగానే భారతదేశానికి హక్కుల విడుదల ప్రకటన వెలువర్చింది. ఆ మహారాణీ ప్రకటన ద్వారా తమకెన్నో హక్కులు లభించాయని సామాన్య ప్రజలు మధ్యతరగతులు సైతం మురిసిపోనారంభించారు. సంఘసంస్కరణ బాధ్యతను శిరసావాహించిన యుగ పురుషుడు వీరేశలింగం వంటి నిశిత బుద్ధులైనవారు సైతం యీ భ్రాంతిలో పడిపోయారు. విక్టోరియా రాణి గురించి పద్యాలూ, కావ్యాలూ కుప్పలుతెప్పలుగా ఉప్పతిల్లాయి!

నిజానికి విక్టోరియా రాణి హక్కుల ప్రకటన దేశీయుల కంఠాలకు ఉరిఉచ్చులే. తత్పూర్వ దశాబ్దాలలో నిలదొక్కుకున్న తెల్లవాడి పాలనకు, అనేక శతాబ్దాలుగా పాతుకు పోయి ఉన్న బానిస మనస్తత్వానికీ కొత్త ఊపిరి సలపనారంభించింది. ప్రజా బాహుళ్యంలో పాలకుడెవడైతేనేమిలే అనే ఉదాసీనత మరింత గాఢంగా వ్యాపించింది. జడత్వం మరింత బలం కూర్చింది. కనకనే ప్రథమ స్వాతంత్ర్య పోరాట దశనుంచీ అనుస్యూతంగా సామాన్యప్రజానీకం అసంతృప్తినీ, స్వాతంత్ర్యేచ్ఛనూ ప్రకటించడం మృగ్యమైపోయింది.

ప్రథమ స్వాతంత్ర్య పోరాటంలో సైతం సామాన్యప్రజలు భాగస్వామిత్వం కనిపించనేలేదు. దేశీయ పాలకులు, ప్రభు వర్గీయులు సిపాయిలు ఇత్యాది ఉన్నత వర్గాల అల్పసంఖ్యాకులే పోరాట శక్తులుగా నిలిచాయి. అందువల్లనే సహజంగా బ్రిటీష్ సామ్రాజ్యశక్తికే వీగిపోయారు.

బ్రిటీష్ వలసగా భారత్‌మారిన పిదప తమ స్వలాభం కోసమే రైలుదారి నిర్మాణం

ప్రారంభమైంది. నదులకు వంతెనలు, ఆనకట్టలు నిర్మితమయ్యాయి. ఇంగ్లాండులోని తమ పరిశ్రమలకు-భారతదేశంలో పుష్కలంగా పండుతున్న ప్రత్తి, జనపనార యితర ఆరణ్యకోత్పత్తులు ముడిసరుకుగా తరలించుకోవడానికి - ఓడలకెక్కించుకు పోయేందుకు అనుకూలంగా రేవులు నిర్మించడానికి ఫ్యాక్టరీలు నిర్మాణమయ్యాయి. ఈ సామూహిక పారిశ్రామిక కేంద్రాల ఫలితంగా మన దేశంలో ఒక నిశ్శబ్ద పారిశ్రామిక విప్లవం ఆయత్తమైంది. భారతీయులలో చైతన్యం వినూత్న తరంగాలనుద్భూతం చేయనారంభించాయి.

ఈ నూత్న చైతన్య ఆవిష్కారంగానే రాజా రామ్మోహనరాయ్ వినూత్న చైతన్యాన్ని అభివ్యక్తం చేశాడు. దాదాపు ఏభయి సంవత్సరాలకు పూర్వమే మెకాలే ఆంగ్లభాష వ్యాప్తి కోసం చేసిన ప్రతిపాదన నేపథ్యంలో ఉండగా రాజా రామ్మోహనరాయ్ 1772-మే 22వ తేదీన అవతరించి ఆబాల్యాదిగా భారతీయ సంఘసంస్కరణ గురించి యోచింప నారంభించాడు.

ఆయన శిష్యుడైన ఈశ్వర చంద్ర విద్యా సాగరులు ఆంగ్ల విద్యావిధానం ప్రవేశపెట్టాలన్న సిద్ధాంతాన్ని ప్రచలితం చేసి, బ్రిటీష్ పాలకులతో సంప్రదింపులు ప్రారంభించాడు. వీరివురికీ ఏర్పడిన విశ్వజనీన దృష్టి వినూత్న సమాజావిర్భావానికి దారితీసింది.

ఆంగ్ల విధ్యావిధానానికి పట్టుకొమ్మలైన కళాశాలలు కలకత్తాలో మొదటగా ప్రారంభమయ్యాయి. బ్రిటీష్ సామ్రాజ్యానికి 1910 వరకూ రాజధానిగా ఉండిన కలకత్తాలో వినూత్న చైతన్యధార ప్రస్ఫుటమైంది. తదుపరి మద్రాసు నగరంలో సైతం కళాశాలలు స్థాపించబడ్డాయి. మొదట్లో బ్రిటీష్ యీస్ట్ ఇండియా కంపెనీవారు భారతీయులు విస్తృతంగా ఆంగ్ల విద్యావేత్తలు కావడంవల్ల తమ ఉనికికి ముప్పేర్పడుతుందనే భయపడ్డారు. కానీ బ్రిటీష్ వలసగా రూపొందిన మలిదశలో భారతీయుల కోరికకు తలవొంచక తప్పలేదు. భారతీయులకు ఆంగ్ల విద్య నేర్పడం ద్వారా వారిని శాశ్వత బానిసలుగా నిలిపి, గుమస్తాలుగా తమ పరిపాలనకు సహకరించే మంచి వినయవిధేయతలు గల సత్సీల బానిసలను రూపొందించగలమన్నదే టి.బి. మేకాలే ప్రతిపాదనల అంతస్సారం. కాని భారతదేశంలో ఆంగ్ల విద్యాభ్యాసం వారికి స్ఫురించని నూత్న చైతన్యాన్ని విస్తరింప చేసింది. 19వ శతాబ్దపు ద్వితీయార్ధంలోనే వంగదేశం పుష్కలంగా చైతన్య విలసితం కానారంభించింది.

1848లో త్యాగరాజస్వామి మరణం వరకూ దక్షిణ భారతంలో నాయకరాజు లేర్పరచిన (తంజావూరు-మధుర కేంద్రాలుగా) తెలుగు సంస్కృతి కొసమెరుపులు ప్రదర్శిస్తూనే వచ్చింది. తంజావూరు ప్రక్కనేగల పంచనదక్షేత్రం తిరువయ్యారులో

సంగీతమూర్తి త్రయం అవతరించి గొప్ప వాగ్గేయకారులుగా ప్రకాశించారు. అందులో త్యాగరాజస్వామి నిర్మలమైన శిష్ట వ్యవహారిక భాష ద్వారా మధురమైన పల్లవులు నిర్మించి శాస్త్రీయ సంగీతాన్ని ప్రజలపరం చేశారు.

సరిగ్గా త్యాగబ్రహ్మ అవతారం చాలించిన కొద్దినెలలకే గోదావరి తీరంలో వీరేశలింగం అవతరించాడు. ఆ సంధియుగంలో సాధారణ మధ్యతరగతి కుటుంబంలో జన్మించిన యే శిశువూ భావి భారత సమాజ విధాత కాగలడన్న ఆశ ఎవ్వరికీ కలిగే అవకాశమే లేదు. కాని వీరేశలింగం స్వయంకృషితో విశాల దర్శనమలవర్చుకున్నాడు. మరో పదహారు సంవత్సరాలకే సాంఘిక విప్లవకారుడిగా దర్శనమిచ్చాడు.

వీరేశలింగం కలం పట్టేవరకూ తెలుగు సాహిత్యం-హేతువాద వాసనలనే ఎరుగదు. గతాను గతికత్వంలో నిస్సత్తువగా సాగిపోతున్నది. దినాలు పరస్పర ప్రతిధ్వనులై జవసత్వాలు కోల్పోతున్నాయి వీలైనంత వెనుక చూపే దానికి దర్శనాధర్మమై పోయింది. సమకాలీన సామాజిక స్థితిగతుల పరిశీలన కవిగాయకులకు అస్పృశ్యమై పోయిది. కనుకనే గతంలోని రెండు శతాబ్దాల సాహిత్యాన్ని ఆయన అంధయుగమని పేర్కొనవలసి వచ్చింది (కవుల చరిత్ర).

ఆచారాది సకల సామాజికాంశాల లోనూ, కావ్యవస్తువరణంలోనూ ఇది నిస్సందేహంగా సత్యమే. కాని భాషాపరంగా నూత్న ఆశారేఖ ౹ ౹ తంజావూరు సాహిత్యంలో పొడసూపాయి. భాషాపరమైన విప్లవాన్ని వీరేశలింగం చాలా లేటుగా గుర్తించడంవల్ల ఆయనకీ అంశం కనిపించలేదు. ప్రతి మహనీయుని పరిమితులు, అతీత శక్తులూ గతి తార్కికంగా అవగాహన చేసుకుంటే యీ పరిమితి వీరశలింగం విషయంలో దోషం కానేరదు!

అంతేకాదు భాషాస్వరూపం ఒక్కటే సాహిత్య జీవన రేఖలను నిర్ణయించదు. మృతగతాన్ని నవ జీవన శీర్షభాగాన నిలిపే ప్రయత్నం ఏ దిశగా జరిగినా తిరస్కరణీయమే! జీవితమూ, సాహిత్యమూ కావాలని కళ్ళు మూసుకుని వెనక్కి నడిచిపోవడం నిర్జీవస్థితినే చేరుకుంటుందని యుగపురుషుడు గ్రహించాడు. అప్పటికే దైవభక్తి ప్రభుభక్తికి శ్రుతి మార్పుగా పరిణమించి బానిస బంధాలు బిగిస్తోంది.

1860ల దశకంలో జన్మించిన రవీంద్రకవీంద్రుడు, మహాకవి గురజాడ, మహాకవి సుబ్రహ్మణ్య భారతి, విశ్వమత ప్రవక్త వివేకానందులు, మహాద్రష్ట చిలకమర్తి లక్ష్మీ నరసింహం ప్రభృతులు సాహిత్యంలోనూ, సామాజిక జీవితంలోనూ విప్లవాత్మక చైతన్యాన్ని పరిపోషించారు.

1892లో విరచితమైన కన్యాశుల్కం ప్రథమ పాఠంలోనే సంఘసంస్కరణోద్యమ

నేపథ్యంలో ఉత్తమ కావ్యధర్మాలు దర్శనమిచ్చాయి. 18వ శతాబ్దం ముగిసేనాటికే భారతీయులలో ఆంగ్లవిద్యా విధానం స్థిరరూపం దాల్చింది. 1905నాటి 'వందేమాతరం' మహోద్యమం యావద్దేశాన్నీ సంపూర్ణంగా కదిల్చివేసింది. ఆంగ్ల విద్య ద్వారా ప్రపంచ సాంఘిక రాజకీయ పరిస్థితులను గ్రహిస్తున్న మేధావివర్గం - మనదేశ స్వాతంత్ర్య పోరాటంలో పటిష్టమైన మార్గాలు అన్వేషింప నారంభించారు. 1848లో వీరేశలింగంతోపాటు జననమందిన సురేంద్రనాథ్ బెనర్జీ వినూత్న వంగదేశ హృదయానికి ధమనిగా మారాడు. బంకించంద్రపాల్, లాలాలజపతి రాయ్, బాలగంగాధరతిలక్‌లు త్రినేత్రులై బానిస బంధాలకు వ్యతిరేకంగా ప్రళయకాల శివంకరులై నిలిచారు.!

ఈ నేపథ్యంలో చైతన్యమందుకున్న గురజాడ క్రాంతదర్శిగా కన్యాశుల్క రచనోత్తర కాలంలో తీవ్ర యోచనా ధారలలో నిమగ్నమై- తెలుగు సాహిత్యంలో సంపూర్ణ ఆధునికత్వాన్ని నెలకొల్పే మార్గాలు అన్వేషిస్తున్నారు.

1909లో దర్శనమిచ్చిన హెయిలీ తోకచుక్క భారతీయులను భయభ్రాంతు లొనర్చింది. మూఢవిశ్వాసాలతో మూర్ఖ నిర్ణయాలతో కృశిస్తున్న భారతజాతికీ దర్శనం కునికే నక్కపై తాడిపండు పడినంత ప్రాణాంతకమైంది. ఏదో విపరీత అరిష్టం కలుగు తుందనీ, కోట్లాదిగా జననష్టం వాటిల్లుతుందనీ స్వార్థపరులైన జ్యోతిషపండితులు ప్రచారానికి నడుంకట్టారు. అప్పటికే హేతువాద పరిపక్వతతో ఉధునిక యోచనా ఝంఝులు ప్రసరిస్తున్న మహాకవి గురజాడ పరిస్థితుల కెదురీదవలసి వచ్చినా- జంకలేదు. అధిక సంఖ్యాకుల మనోభావాలకు వ్యతిరేకించడం ఎదురీతవంటిదే, భయానకమే;

కాని -

**"ధూమకేతువు కేతువనియో**
**మోము చంద్రుడు అలిగి చూడడు**
**కేతువాయిది?**
**వేల్పులలనల కేలివెలితొగ**
**కాంచుమా?**
**అరుదుగా మినుచప్పరంబున**
**వొప్పు తెలియని వింత పొడమగ**
**చన్నకాలపు చిన్నబుద్ధులు**
**బెదిరి యెంచిరి కీడుగా...."**

అంటూ అతి లలితపద జాలంతో చెప్పినా, బహుభాషల ఊదరవల్ల స్థూల దృష్టికి అందని దుస్థితి యేర్పడింది.

ధూమకేతువని తోకచుక్కకు పేరుపెట్టిన సంస్కృతులు దీనిని కేతువుకు సహోదర

సమానంగా భ్రమించారు. దీనితో స్వీయకుల పాలికా ప్రియాంగనాముఖ చంద్రుడు ఆకేతువును చూడడానికి కినుక వహించాడు. నిజానికిది కేతువూకాదు, తీతువూకాదు వేలుపు వనితలు కేలికి తొడుగుకున్న తెల్లని కాంతిరేఖ మాత్రమే!

మిన్ను చప్పరంలో అరుదుగా యిది దర్శనమిస్తుంది. చప్పరం అంటే సౌధోపరిభాగం బాల్కనీవంటిది. పిల్లి అంటే మార్జాలం అనే అర్థం చెప్పుకోవలసిన దుస్థితి!

దీని అందం తెలియని గడిచిన కాలంలో బుద్ధిహీనులు బెదిరిపోయారు. కీడుగా యోచించారు! .....అన్న మహాకవి ఉద్ఘాటన ఎంత విప్లవాత్మకమో అంత రామణీయకమూను. ఇదే ఆధునిక యోచనాధారకు తొలి దీపకళిక!

**ఒక ఆధారశిల!**

మధ్యయుగాలలో మెరుపులు కురిపించిన వేమన యోగి ఆధునిక సందేశాలను సనాతన మూఢాచారపరాయణులు ఆయన పేరుతో పాటు సూక్తులను తుంగలోనికి తొక్కేశారు! బ్రౌను మహాశయుని త్యాగనిరతితో వేమన పునరుద్ధరించ బడకపోతే మన యూనివర్సిటీల పండితమ్మన్యులు ఆధునికతను కేవలం కాలవాచిగానే పరిమిత నిర్ధారణ చేసేవారే!!

హేతువాద దృష్టికి ఆధీనం కానిదేదీ ఆధునికం కాదని నిర్ద్వంద్వంగా నిర్దిష్టం చేసుకోవాలి. అదే మనకు మహాకవి గురజాడ అందించిన యోజనా ఝుంఝు! అంతేకాదు ఆయనే ప్రప్రథమంగా పాశ్చాత్య మేధావుల వైజ్ఞానికశాస్త్ర పరిశోధనలను సైతం కీర్తించాడు.

**"దూరబంధువు ఇతడు భూమికి**
**దారిపోవుచు చూడవచ్చెను**
**డెబ్బదెనుబది ఏళ్ళకొకతరి**
**నరుల కన్నుల పండుగై ...."**

అదే సంవత్సరం యీ తోకచుక్క పుట్టుపూర్వోత్తరాలను పరిశోధించి, ప్రముఖ ఖగోళశాస్త్రవేత్త హెయిలీ ప్రకటించాడు. ఈ "తోకచుక్క క్రీ॥పూ॥ 464నుంచి ప్రతి 78 సం॥ల కొకసారి కనిపించి తీరుతుందని ప్రకటించాడు. ఆ సంవత్సరం నుంచే ఆ తోకచుక్కకు ఆయనపేరే పెట్టారు. దీని సమాచారం ఆంగ్లభాష ద్వారా తెలుసుకోగల్గానని మహాకవి వక్కాణించాడు. సాధారణ నేత్రానికి కానరాని వస్తుతత్త్వాన్ని కూడా కాంచగలిగిన నిశితజ్ఞు లాంగ్లేయులని మహాకవి ప్రస్తుతించారు.

ముఖ్యంగా ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమం పరాకాష్టకు చేరుకున్న కాలమది. దానిని హర్షిస్తూ దేవతలే విజయధ్వజాన్ని ఆవిష్కరిస్తున్నారని ఆశావహమైన

అతిశయోక్తి సంఘటిత మొనర్చారు. తన నూతన భావాలకు, వాటిని ఆవిష్కరించడానికి సంసిద్ధ మొనర్చుకున్న వినూతన కవితా వాహనం ముత్యాలసరాలకు, తద్వారా ఆధునిక హేతువాద కవిత్వానికీ, - 'మేనిఫెస్టో' అనతగిన తొలిరచనలోనే విస్పష్టంగా యింకా యిలా ప్రకటించారు.

**"చూడు మునుమును మేటివారల**
**మాటలనియెడి మంత్ర మహిమను**
**జాతి బంధములన్న గొలుసులు**
**జారి సంపదలు బ్బెడున్!**
**"యెల్లలోకము లొక్క ఇల్లయి**
**వర్ణభేదము లెల్ల కల్లయి**
**వేల నెరుగని ప్రేమబంధము**
**వేడుకలు కురియు...."**

1910లో యింత అంతర్జాతీయ దర్శననూ, మతాతీత హేతువాద దృష్టినీ ప్రసరించిన మహాకవి హృదయం ఎంత కాలాతీతమో! ఆనాటికింకా వావిలకొలను సుబ్బరాయకవి, రామాయణం రాస్తున్నారు. వసురాయకవి వేణీ సంహారం అనువదిస్తున్నారు. సమకాలీన కవుల పరప్రత్యయన్యేయబుద్ధి నుంచి మహాకవి గురజాడ ఎంత ఎత్తు ఎదిగారో అర్థం చేసుకోవచ్చు! వేల (సరిహద్దు) నెరుగని ప్రేమబంధం సకల మానవ హృదయాలనూ ఏకం చేయాలని ఆయన కాంక్షించారు.

**"మతము లన్నియు మాసిపోవును**
**జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును**
**అంత స్వర్గ సుఖమ్ములన్నవి**
**అవని విలసిల్లున్....**
**"మొన్న పట్నమునందు ప్రాజ్ఞులు**
**మొట్ట మొదటిది మెట్టు ఇదియని**
**పెట్టినారొక విందు జాతుల**
**చేర్చి - వినవైతో?"**

మహాకవి గురజాడ నిశ్శంసయంగా క్రాంతదర్శి. 20వ శతాబ్దారంభంలో ఉండి, ఈ శతాబ్దాంతానికి ప్రపంచ ప్రజల స్వరూప స్వభావాలలో నిశ్చయంగా రావలసిన మార్పులను దర్శించగలిగారు. ప్రపంచ మానవులలో ఎన్నో మతాలున్నాయి! కాని ఆధునిక ప్రపంచంలో వైజ్ఞానిక శాస్త్రం పెంపొంది మతవిశ్వాసాలను పరాస్తం చేస్తోంది. కనుక స్వార్థపరులు కుతంత్రాలతో వెనక్కిలాగిపెట్టకపోతే మతమౌఢ్యం పూర్తిగా

మాసిపోయేదే! జ్ఞానం ఒక్కటే లోకమంతా దేదీప్యంగా వెలుగుతుందన్న మహత్తర ఆశాభావం మహాకవి కుంది. ఈ మార్పు జరిగినపుడు అవనిలోనే అమృతమయ స్వర్గలోకం మొలుస్తుంది. ప్రజలందరికీ సుఖజీవనం అమరుతుంది. ఈ ఆశకు నాందిగానే - అంతకుముందే నగరంలో నానాజాతి ఏకపంక్తి భోజనం ఏర్పాటు చేశారు విజ్ఞులు! అది మొదటి మెట్టనే వారి ఆశ!

ఇక పట్టణం అనే పదాన్ని మహాకవి బరంపురం నగరానికి సంకేతంగా ప్రయోగించారు. సముద్రరేవు పట్టణానికే పట్టణం అని ఉండటం పరిపాటి. ఆ పట్టణంలో జరిగిన విందు దక్షిణ భారతానికే మొట్టమొదటిది. ఈ నానాజాతి సమాహారమైన విందు గురించి కులపాలికకు వినిపిస్తున్నారు.

ఈ నవ చైతన్యంతోనే తాను తేటయిన మాటలు కూర్చుకొని ముత్యాలసరాలు గ్రుచ్చ సంకల్పించారు. తూర్పు బలబల తెలతెలవారుతుండగా తొలికోడికూతతో యిల్లు చేరుకున్నారు. కార్యవశమున పోయి పట్నంలో పదినాళ్ళుండి అప్పుడే వచ్చారు. సంఘసంస్కరణ ప్రవీణుల సాంగత్యంలో మెలిగారు. ఆ నవ చేతన యావత్తూ ముత్యాల సరాల తొలిగీతం పరంగా అభివ్యక్తమైంది. ఆయన ఆ ఉత్సాహంతో తన కుల పాలికకు నివేదించబోగా ఆమె సహజంగా కినుక వ్యక్తం చేసింది. ఆయన సంఘ సంస్కరణకు ప్రతినిధి. కనుక వైరభావం సహజమే! అందుకే ఆమె ఎద్దేవా చేస్తూ

**"కోటిఫేటలు ఏలగలరని**
**కొటి విద్యలు మీకు కరిపిరి;**
**పొట్టకూటికి నేర్చు విద్యలు**
**పుట్టకీట్లు కదల్చెనా?"**

అని ఆమె అమాయకంగా ప్రశ్నించినా, సత్యమే పలికింది. పొట్ట కూటికోసమే నేర్చిన ఆంగ్లవిద్య భారతీయ వైదిక విశ్వాసాల పునాదులు కదిలించింది. ఆలోచనలలో నూతనత్వం భాసించింది. జీవిత విధానంలో క్రొత్త చూపు ప్రసరించింది. విషయావ గాహనలో క్రొత్త మెళుకువలు పొడసూపాయి. ఆంగ్ల విద్యతోనే భారతీయులలో వికాసం కలుగ నారంభించింది.

జడమయంగా మిగిలిపోతున్న లోకులంతా ఈ సత్యాన్ని గ్రహించ లేకపోతున్నారు. ఆ లోకానికి తన సతీమణిని ప్రతినిధిగా నిలిపారు. కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధానులు వంటి వారిని యిదివరకే చిత్రించారు. ఎంత విశదమొనర్చినా ఆమెలో చైతన్యం మోసులు వారలేదు. భర్తమాటలు పరిగణించలేదు; దూరంగా వైదొలగిన ఆమెనుద్దేశించి, ఈ

కావ్యాన్ని ముగిస్తూ మహాకవి యిలా ఉద్ఘాటించారు.

**"తూర్పు బలబల తెల్లవారెను**
**తోకచుక్క అదృశ్యమాయెను**
**లోకమందలి మంచి చెడ్డలు**
**లోకులెరుగుదురా? "**

గురజాడ ముత్యాల సరాలన్నీ పట్టుమని పదికన్నా ఎక్కువ లేవు. ఆ పదింటిలోనే - రాబోయే యుగ సాహిత్యానికంతా మార్గదర్శక సూత్రాలను నిర్దేశించారు మహాకవి. ఆధునిక యోచనా ధారకు రంగాన్ని నిర్మించారు.

గురజాడ ముత్యాల సరాల రచన ప్రారంభించే వరకూ మన సాహిత్యంలో ఉదాత్త నాయకుల మిషపై పురాణ పురుషులే ప్రతిష్టింప బడ్డారు. దేవతలూ, పితృదేవతలూ మనుష్యరూపం ధరించేవారు. నన్నయతో ప్రారంభమైన ఈ సంప్రదాయ మౌఢ్యం చిన్నయ్య వరకూ యధేచ్ఛగా సాగిపోయింది. జాతిలో నిలవబారిన మూఢ విశ్వాసాల నెన్నింటనో వీరేశలింగం వజ్రసంకల్పంతో ఎదిరించారు. దయ్యాలు, భూతాలు, చిల్లంగి వంటి వాటిని మళ్ళీ లేవకుండా నడుములు విరగకొట్టారు. ఆ నేపథ్యంలో గురజాడ సాహిత్య కళకు నిర్దిష్ట రూపు రేఖలను రూపొందించారు.

గురజాడ అవతరణకు కొద్ది నెలల ముందే పరవస్తు చిన్నయసూరి కన్నుమూయడం చరిత్ర సంఘటిత మొనర్చిన గతితర్కమే! ఆధునిక జీవన వాహినికి నూతన భాష్యాలన్నింటినీ ప్రప్రథమంగా తెలుగు సాహిత్యంలో సంసిద్ధం చేసిన ఆదిద్రష్ట గురజాడే! దేవమాత పటాన్ని పూజిస్తున్న రోజులలో - "దేశమంటే మట్టి కాదనీ, మనుషులనీ" చాటి చెప్పగల సాహసం గురజాడ గుండెలలో కుదురు కోవడంలో ఆశ్చర్యం లేదు.

**( విశాలాంధ్ర - 1.5.1997 )**

# 3. సమాజ దౌష్ట్యాలపై వీరేశలింగం దూసిన కత్తి - కన్యాశుల్కం రచనకు స్ఫూర్తినిచ్చిన "బ్రాహ్మవివాహం"

నవయుగ బ్రహ్మ కందుకూరి వీరేశలింగం నిస్సంశయంగా మహాపురుషుడు. చిత్తశుద్ధితో, కార్యదీక్షతో సంఘసంస్కరణ పతాకను దశదిశలా ఎగరవేసిన ఆద్యుడు. నిజాయితీ, ఆత్మ గౌరవమూ జాతిలో నెలకొల్పిన చిరయశస్వి! ఆయన పూనుకొన్న ప్రతి కార్యాన్నీ అప్రతిహత దీక్షతో కొనసాగించాడు. ఎన్ని అడ్డంకులు వచ్చినా ధీరహృదయంతో ఎదురొడ్డి మహత్తర విజయాలు సాధించాడు. నిరంతర క్రియాశీలిగా, అప్రతిహత కర్మవీరునిగా, ఆదర్శ పురుషునిగా నిలిచాడు. తెలుగుజాతి తరతరాలకూ వినమ్రతతో కీర్తించుకోతగిన మహనీయుడు.

ఆధునిక సాహితీ ప్రక్రియల కెన్నిటికో ఆయనే ఆరంభకుడు. తెలుగు భాషలో సమకాలీన సమాజ ప్రతిబింబాలనదగిన పాత్రలను సృష్టించి సాహిత్యానికి గతి కల్పించాడు. పితృదేవతల కట్టు బానిసత్వంనుంచి తప్పించిన క్రాంతదర్శి. తన ప్రతి రచననూ సామాజిక విప్లవ విస్ఫులింగంగా మార్చిన ప్రప్రథమ విప్లవ తరంగం ఆయనే!

ఆయన రచించిన అసంఖ్యాక ప్రహసనాలకు సజీవ వ్యావహారిక భాషని ప్రయుక్తం చేసిన సత్యం - సామాన్యులకే కాదు. పండితులకే తెలియదు. సామాజిక వాస్తవికతను సవిమర్శక ప్రమాణాలతో సాధించిన మహనీయుడాయనే! తెలుగు సాహిత్యం అంతకు మునుపెన్నడూ ఎరుగని అనేక వినూత్న ప్రక్రియలను అందించాడు. ముఖ్యంగా ప్రహసనాల ద్వారా సామాజిక నాటకాలకు తొలిదీపం వెలిగించి సకలాంధ్రులకూ ఆరాధ్యుడయ్యాడు.

వీరేశలింగం రచించిన చిన్నా పెద్దా ప్రహసనాలు దాదాపు నలభయి పైచిలుకు. అన్నిటిలోకి "బ్రాహ్మవివాహం" అనే పెద్దయ్యగారి పెండ్లి మొట్ట మొదటిదీ, అనన్యసామాన్యమైనదీని. తెలుగు ప్రహసన సాహిత్యానికే ఆదిపీఠమది. క్రీ॥శ॥ **1878లో** ప్రచురించబడింది. పరిశోధకులకో, రంధ్రాన్వేషణా, పరతంత్రబుద్ధులకో భవిష్యత్తులో సందేహం కలగవచ్చుననే అనుమానం ఆయనకు కలిగింది కాబోలు. ఇలా నిష్కర్షగా వక్కాణించారు.

"...... మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభశైలిని రచించవలెననియే నాయభిప్రాయము, ఐనను విషయాను

గుణముగా, తత్తదు చితరీతిని-గ్రామ్యభాష యందు సహితము గ్రంథములను వ్రాయవచ్చునని కూడ నాయభిప్రాయము. ఏ విషయమునకు నేనితరులు చూపిన దారిని పోవువాడను కాను. మనసు తిరిగినపుడు నా దారినే నేను నడుచువాడునగుట చేత సులభ వచన రచనా విషయమై ఇతరుల మాటలను పాటిచేయక నా నూతన మార్గానుసారము సంభాషణ రూపమున బ్రాహ్మ వివాహము వ్రాసి "హాస్యసంజీవని" మొదటి పత్రికలో కొంత భాగము ప్రకటించితిని ...." (స్వీయ చరిత్ర.)

- అంటూ కంఠోక్తిగా ఒక చారిత్రక యథార్థాన్ని స్థాపించారు. తాను విశ్వసించిన అభిప్రాయం ప్రకారమే బ్రాహ్మ వివాహాన్ని రచించాడు. సులక్షణమైన వ్యావహారికంలోనే రచించినా - దానిని కాలానుసారంగా గ్రామ్యభాష అనడంలో మనం తప్పు పట్టనక్కర లేదు. ఆనాటి బహుపండిత జనప్రయుక్తంగా సజీవ భాష ఆవిధంగా నిరసించబడుతోంది.

ఈ సందర్భంలోనే ఆయన మరొక సత్యాన్ని వెల్లడించాడు. "నీతి చంద్రికలోనీ విగ్రహమును సంధిని చేసిన తర్వాత నాకొక యాలోచనము కలిగెను. భాషవలన సాహిత్యము వలన ప్రయోజనమేమి? జనులు తమ యభిప్రాయాలు నొండొరులకు తెలుపుకొనుట; భాషలోని గ్రంథముల వలన ప్రయోజనమేమి? తమ భావములు దూరముననున్న వారికిని, రాబోవుతరముల వారికిని సులభముగా తెలుపుట. అట్టి సౌలభ్యము విగ్రహము వంటి పుస్తకముల వలన కలుగునా? - కలగదు!" అని నిష్కర్షగా ఆత్మ విమర్శ చేసుకున్నాడు.

విగ్రహాదులలోని పదాలు, వాక్యాలు సామాన్యుల కర్థం కావాలంటే పండితుల నాశ్రయించవలసిందే! ఆ సత్యాన్ని కూడా ఆయన నిజాయితీతో గ్రహించాడు. ఆ అవగాహనతోనే ఇలా వక్కాణించాడు. "అందరికీ తెలియునట్లు గ్రంథములు సులభముగ నుండవలెను..." ఇది భవిష్యత్ సాహిత్య శాశనమే!

ఈ నిర్ణయంతో సాహసోపేతంగా వ్యావహారిక భాషనే ప్రహసనంలో ఉపయోగించాడు. సంభాషణా రీతిలో - బ్రాహ్మ వివాహం మొదలుకొని సమస్త ప్రహసనాలూ రచించాడు.

### అప్పటికే వాడుకభాష:-

తంజావూరు రాజుల కాలంలో వెలసిన మన్నారదాస విలాసం వంటి అనేక యక్ష గానాలలో వాడుకభాష ధారాళంగా ప్రయుక్తమైంది. తరువాత వచ్చిన మహారాష్ట్ర పీష్వాల రాజరికంలో సైతం అదే ఒరవడి కొనసాగింది. మహా వాగ్గేయకారుడు త్యాగరాజు, బహు సరళమైన వ్యావహారిక నుడికారంతో మధురమైన పల్లవులతో ధాతుమాతు సంఘటనగా కృతులను రచించాడు.

1820 లలో క్రిస్టియన్ మిషనరీలు తెలుగులో ముద్రణా యంత్రాలు నెలకొల్పి - వారి మతప్రచారం చేసుకోవడం తోపాటు తెలుగు సాహిత్య పత్రికలను సైతం ప్రచురించ నారంభించారు. ఏనుగుల వీరాస్వామయ్య - 1830 మే 18వ మద్రాసులో బయల్దేరి సపరివారముగా కాశీయాత్రకు చేశారు. తాను సేకరించిన భోగటట్టాలన్నీ కాశీయాత్ర చరిత్రగా పొందుపరచి పుణ్యం కట్టుకున్నాడు. చక్కని వాడుకభాషలో "నా వుప్పాడ బోయీలను ఎనిమిది మందిన్ని వారికి సామాను తేను 3 బోయీలన్ను నా సామాను తేను నా కావటివాండ్లను అర్గురున్ని తీసుకున్నాను.... ఇలా తేటగా సాగుతుంది.

1856లో ధారావాహికంగా విరచించిన సామినేన ముద్దు నరసింహం (ముద్దు కృష్ణగారి ప్రపితామహుడు) హిత సూచనిలో సైతం మెత్తని వాడుక భాషనే వినియోగించారు పదవ్యాపారమునకు ఏర్పరచ బడే హద్దులు భాషను రచించడమునకున్న లిఖించడము నకున్ను సాధ్యమైనంత సులభముగా నుండవలసినది - ఆవశ్యమైయున్నది. ఈ రీతిగా వారి గ్రంథ జనహితాభిలాషతో సాగిపోతుంది. ఈ పూర్వరంగంలో సంభాషణా ప్రధానమైన ప్రహసనం లక్షణ భాషలో సాగించడం జొన్న చేనులో దిష్టి బొమ్మను నిలపడంగా తయారవుతుందని ఇంగిత జ్ఞానమున్న ఆ మహనీయుడు గ్రహించాడు. కాని చిన్నయసూరి ప్రవేశించి వ్యాకరణాభిఘాతంతో శిష్ట జనావ్యావహారికాన్ని "అశిష్ట గ్రామ్యంగా" నిందార్హం చేశాడు. ఆ దుష్ట సంప్రదాయంలోనే వీరేశలింగం మొదటి రచనలతో కొట్టుకుపోయాడు. ప్రహసన రచన చేపట్టే అవసరం కలిగేసరికి మారక తప్పింది కాదు.

సంస్కృత నాటకాలలో పాత్రోచిత సంభాషణ కోసం నీచ పాత్రలకు ప్రాకృతం, పైశాచీ, పాళీవంటి భాషలు పరిపాటిగా ఉపయోగించబడటం వీరేశలింగం ఎరుగనిదికాదు. కాని తెలుగులో వైయ్యాకరణుల ధాష్టీకం గట్టి మేకు బందీ చేసింది. కాళిదాస మహాకవి రచించిన ప్రపంచ ప్రఖ్యాత "అభిజ్ఞాన శాకుంతలాన్ని" రసమయ నాటకంగా అనువదించే ధైర్యం లేకనే పిల్లలమర్రి పినవీరభద్రకవి ప్రబంధంగా మలిచాడనిపిస్తుంది. భాషా శాసనాల భయం వల్లనే సరళసుందర నాటకాన్ని జటిలీకరించాడు. ఆ సత్యం గ్రహించి నందునే వీరేశలింగం సరళ మనోహర నాటకంగా 'శాకుంతలాన్ని' తెలుగు చేశాడు.

తెలుగు సాహిత్యంలో ఈ దుర్దశ ఆనుపూర్వికంగా సాగుతున్నదే! కాని యక్ష గానకర్తలు (కందుకూరి రుద్రకవి కాలం నుంచీ) మాత్రం యథాశక్తి ప్రతిఘటిస్తూనే వచ్చారు. స్వతంత్రిస్తూనే ఉన్నారు కనుకనే తెలుగులో యక్షగానం ఒక్కటే - రూపక ప్రక్రియ లన్నింటికీ ప్రతినిధిగా నిలవక తప్పలేదు. 18వ శతాబ్ది చివర వరకూ ఈ సంప్రదాయం అవిచ్ఛిన్నంగా సాగింది. వీరేశలింగం 1878లో బ్రాహ్మవివాహం ప్రచురించే వరకూ విస్తృత గ్రంథాదరణ లభించలేదు. జాతి జనుల నాలుకలపై సదా త్రుళ్ళింతలాడే తీయని తెలుగు భాషను వీరేశలింగంతో సహా పండితులంతా గ్రామ్యమని నిందించారు,

వైదొలగించారు. శిష్ట వ్యావహారికమనే పరిభాష అప్పటికింకా స్థిరపడలేదు. ఆ పని మహాపురుషుడు గి.రాం.మూర్తి ద్వారా ఇరవయ్యో వతాబ్దపు మలిదశకం నుంచీ స్థిరపడింది.

**జాతికి వివేక వర్ధిని:-**

వీరేశలింగం అవతరణమే జాతికి పునరుజ్జీవన సూర్యోదయం. ఆయన జీవన కృషి తెలుగు జాతికి వివేక వర్ధిని, గతాను గతికంగా సాగిపోవడం మాని ఆగి ఆలోచించ నారంభించిన దాయనవల్లనే! 1878 జూలై నెలారంభం నుంచీ ఆయన "వివేకవర్ధిని" మాస పత్రికను పక్ష పత్రికగా మార్చాడు. దానికి అనుబంధంగా "హాస్యసంజీవిని" అని మరో మాసపత్రికనూ ప్రారంభించాడు.

దేశాభివృద్ధికి భంగకరంగా నిలిచిన సకల పూర్వాచార ఛాందసాలనూ ఖండించ నారంభించాడు. దేశాభివృద్ధి కారకాలైన నూతనాచరణలను సిద్ధాంతం చేశాడు. ఈ మహత్తర సంచలనంతో వివేకవర్ధిని పురోగమించింది.

కొక్కొండ వెంకటరత్నం పంతులుకీఅభివృద్ధి కన్నెర్ర కలిగించింది. ఆయన గురించి వీరేశలింగమే అన్నట్లు - పూర్వాచార స్థాపన దీక్షాదక్షులు, నిశితాసి పత్రికా ధారులున్నూ! ఇక చెప్పవలసిన దేముంది? పంతులుగారు చేపట్టిన ప్రతి ఉద్యమాన్నీ ఖండించడానికి పూనుకున్నాడు. వీరేశలింగం రచనలను గేలి చేయడానికే తన సర్వశక్తులూ ఒడ్డాడు. కొక్కొండ హాస్యవర్ధిని అనే పత్రిక స్థాపించాడు. దానికి ప్రతిఘటనగానే హాస్య సంజీవిని స్థాపన అవసరమైంది. ఆ విధంగా పరోక్షంగానైనా ప్రహసన ప్రక్రియ తెలుగులో ప్రాదుర్భవించడానికి ప్రేరకుడయ్యాడు కొక్కొండ.

బ్రాహ్మ వివాహం హాస్య సంజీవనిలో ధారా వాహికగా ప్రచురిస్తున్న రోజులలో ప్రజలెంతో ఆసక్తితో చదువుతూ ఆదరించేవారు. అప్పటికి గురజాడ అప్పారావు 16 ఏళ్ళ వాడు హైస్కూలు విద్యార్థిగా ఉండగానే ఆంగ్ల సాహిత్యం శ్రద్ధగా చదువుతున్న జిజ్ఞాసువు. ఆయన కూడా విజయనగరంలో హాస్య సంజీవని తప్పకుండా నిశితంగా అధ్యయనం చేస్తూనే ఉంటాడని ఊహించడంలో అబ్బురంలేదు.

బ్రాహ్మ వివాహానికి ప్రజల ఆదరణ లభిస్తున్న సందర్భాన్ని పురస్కరించుకొని వీరేశలింగం స్వీయ చరిత్రలో యిలా రికార్డు చేశాడు. "అట్టి వ్రాతకదియే తెలుగు భాషయందు మొదలగుట చేత నాదినముల యందెక్కడ చూచినను మూకలు గట్టి జనులు హాస్య సంజీవనిని, ముఖ్యముగా నందలి బ్రహ్మ వివాహమును చదివి యానందించుచూ వచ్చిరి. రెండేండ్లకు తరువాత నేనొకసారి బందరు పురమునకు పోయినప్పుడొక బ్రాహ్మణ బాలిక - "బ్రాహ్మ వివాహమును" మొదటి నుండి

తుదివరకును నప్పగించి నాకాశ్చర్యము కలిగించెను". అని మాత్రమే రాసుకున్నారుగాని, ఆ బాలిక పేరు రాసి చరితార్థను చేయలేకపోయారు.

ఒక నాటకాన్ని కంఠతాపట్టి, తత్రచయితకు అప్పగించడం అప్పటికే కాదు. - ఇప్పటికీ ఆశ్చర్యమే! ఆధునిక నాటక ప్రదర్శనలలో నేటికీ అనేక పాత్రధారులు తమ పోర్షన్లు కంఠతా రాక - ప్రామిటింగు కోసం సైడు వింగుల్లోకి తెల్లబోయి చూస్తూ రసభంగం కలిగిస్తూనే ఉన్నారు.

తొలి ప్రహసనంతో అంతస్ఫూర్తి కలగడం వల్లనే ఆయన అసంఖ్యాక ప్రహసనాలు రచించగలిగారు, ప్రచురించారు. సమాజంలోని సర్వ కాలుష్యాలనూ కడిగి ఎండగట్టారు. స్థిర సంకల్పంతోనే హాస్యరస పోషకంగా; వ్యంగ్య ధోరణిలో సంఘ దురాచారాలను విమర్శించడానికే ప్రహసన మొక నిశితాయుధమని ఆయన విశ్వసించాడు.

హేళనాత్మకంగా తీవ్ర విమర్శలు చేయడంలో ఆయన నేర్పు ఆదినుంచీ వెల్లడవుతూనే ఉంది. కొక్కొండ రచించిన విగ్రహాన్ని విమర్శించి తుత్తునీయులు చేసినపుడే పండితలోకం ప్రశంసించింది.

"శత్రు పక్షంలో నిలిచి కొక్కొండ ఎన్నో రీతులుగా వీరేశలింగం ప్రతిభావిష్కారానికి దోహదం చేశాడు. అందుకే రామునితో పాటు రావణుడున్నూ చిరంజీవే!"

**బ్రాహ్మవివాహం:-**

ఈ ప్రహసనం ఆదిలోనే ముఖ్యపాత్రల నైజ లక్షణాలనూ, నిజస్వరూపాలనూ ఆవిష్కరిస్తుంది. భార్యాభర్తల మధ్య అన్యోన్య ప్రేమాభిమానా లెక్కడా కనిపించవు. భార్య తనకు హక్కు భుక్తంగా సంక్రమించిన పనిగత్తెగానూ, ఆమె యిష్టాయిష్టాలుతో ప్రమేయం లేని స్వయ నిర్ణయ పురుషాధికారంతోనూ భర్త వ్యవహరిస్తాడు. పోతే ఆమె మరీ పేచీపెడితే ఓ బంగారునగ యిస్తానంటే నోరు కట్టేస్తుంది. పరస్పర వైరుధ్యమూ, మూఢత్వమూ, కుచ్ఛితమూ, స్వార్థమూ అన్ని పాత్రల గుండె గూడులనుంచీ బయట పడుతూనే వుంటాయి.

ప్రారంభవాక్యాలను యథాతథంగా ఉల్లేఖించుకుంటే - స్వయం వ్యక్తమవుతాయి:

**కామయ్య:** వోసీ, వోసీ! మనం రహస్యం మాట్లాడు కుంచూ వుంచే ఎవరైనా తటాలున లోపలికి వచ్చిపోతారు! వచ్చే దానవు వీధి తలుపు వేశైనా వచ్చావా?

**అజ్ఞానమ్మ:** యీ చెప్పేది ఇంతకు ముందైనా చెప్పరాకపోయిందీ? తీరా వచ్చి కూర్చున్నాక - పెళ్ళాం ఊరికే ఉండిపోచుందని ఏదో ఒక లేనిపోని పని కల్పిస్తారు. మీరు వెళ్ళి వేసి రారాదా? నాకు తలుపు వేస్తుండడమూ, తీస్తూ ఉండడమూ తప్ప వేరే యేం పని వున్నది? తిరగలేక చచ్చిపోతూ ఉన్నాను. యెలాగయినా నా ఖర్మయే

కాలిపోచుంది. తప్పుచుందా ఏమేమిషి? వెళ్ళి వేస్తానులెండి (అని తలుపు వేసి వచ్చుచున్నది).

పై వాక్యాల ఉల్లేఖన ద్వారా రెండు ప్రయోజనాలు లభిస్తాయి. ఆనాటి ఛాందస వైదిక బ్రాహ్మణులలో టకారతకారాలకు బదులు చకార ప్రయోగం విరివిగా ఉండేది. అదే పైయిరువురి సంభాషణలోనూ అచ్చుమచ్చుగా ప్రతిబింబితమైంది. కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధానులు, వెంకమ్మ యితర కుటుంబ సభ్యులూ యిదే బాణీలో మాట్లాడ్డం అందరికీ తెలిసిందే?

రెండవది భార్యను వక్రంగా భావించి భర్త పనులు పురమాయిస్తుంటే - నిస్సహాయంగా నైనా అసమ్మతి ప్రకటించడమూ కనిపిస్తుంది. గ్రాంథిక భాషలోని చకారం ఆనాటి వ్యావహారిక వాక్యాలకు తగిలిస్తే ఏర్పడ్డ అపభ్రంశ రూపాన్ని బ్రాహ్మణ కుటుంబాలు స్వచ్ఛమైన భాషగా భ్రమిస్తాయి.

ఆనాటి పెద్ద వైయ్యాకరణ పండితులు వడలి లక్ష్మీనారాయణ శాస్త్రి (పిఠాపురం ఆస్థాన విద్వాంసులు) మా పొరుగువారు. సరిగ్గా యిలాగే మాట్లాడేవారు. ఆ భాషను నా బాల్యంలోవిని ఆశ్చర్యపోతూ అనుకరించడం మరచిపోలేను. అందరికీ ఈ ప్రత్యక్షానుభవం ఉండకపోవచ్చు.

సమకాలిక శిష్టజనుల వ్యావహారికాన్ని - తన తొలి ప్రహసనం నుంచీ వీరేశలింగం ఉపయోగంలోనికి తెచ్చారు. పాత్రల గుణాలను బట్టి వారి పేర్లు నిర్ణయించడంలో పురాణ పద్ధతినే అనుసరించారు. ఈ రెండు అంశాలూ కన్యాశుల్కం రచనపై ఎంతగాఢ ప్రభావం కలిగించాయో స్పష్టమే.

ఈ కామయ్య అరవైఏళ్ళు నిండిన వృద్ధ బ్రాహ్మణుడు. అతని భార్య అజ్ఞానమ్మ ఏభయియేళ్ళుపైబడిన సార్థక నామధేయ. వారికి లేకలేక ఒక కూతురు కలిగింది. దానికప్పటికి రెండేళ్ళు నిండాయి. ప్రతినికృష్ట నిర్ణయానికీ వేదాంతాన్ని తోడు తెచ్చుకోవడం బ్రాహ్మల అలవాటు. "భూమి మీద తనువులు శాశ్వతాలు కావుకదా! మా భాగ్యానికల్లా లేకలేక పుట్టిన వక్క కూతురు కదా ఉన్నది! చేతులారా వక్క కన్యాదానం చేసుకుంటే ఎంతో పుణ్యం వస్తుంది".

అంటూ కామయ్య పెళ్ళిళ్ళు కుదిర్చే పుల్లయ్య, పిచ్చయ్యలను పిలిపిస్తాడు. రహస్యంగా సంప్రదిస్తాడు. "ముక్కు పచ్చలారని పసిబిడ్డకు పెళ్ళికేం తొందర?" అంటూ పుల్లయ్య అభ్యంతరం చెబుతాడు. "వడసారమూ మొన్నటి శ్రావణ శుద్ధ నవమికి కదూ దానికి రెండేళ్ళూ వెళ్ళినది? బ్రతికి బట్టకడితే ముందు పెళ్ళి చేసుకోరాదా?" అంటూ నచ్చజెప్పడానికి యత్నిస్తాడు.

తనకున్న లోకానుబవాలన్నీ, మనదేశంలో స్థిరంగా పాతుకుపోయిన వెర్రివేదాంతాన్నీ ఏకరువు పెడతాడు. అజ్ఞానమ్మ సైతం భర్తను సమర్ధిస్తుంది. తన ఆరోగ్యస్థితి వివరిస్తూ గొంతెత్తి పెద్ద పెట్టున ఏడుస్తుంది. పుల్లయ్య, పిచ్చయ్యలు ఓదారుస్తారు.

నూరేళ్ళ క్రిందట తెలుగు బ్రాహ్మణ కుటుంబాల్లో పెళ్ళికొడుకు వైపు వారే నాలుగిళ్ళకీ తిరిగేవారు. మీ అమ్మాయిని మా అబ్బాయికిమ్మని అడిగేవారు. ఓలి యింత ఇస్తామని గాని, యింత బంగారం పెడతామనిగాని బేరాలు కుదుర్చుకునేవారు. పిల్ల పేర ఇంతభూమి రాస్తామనడం కూడా పరిపాటే. కామయ్య కూతురికి రెండేళ్లు నిండేసరికే రెండు సంబంధాలు వచ్చాయి. ఒకడు పదేళ్ల కుర్రవాడు. స్మార్తం చదువుకున్నాడు. అన్నివిధాలా తగిన ఆ సంబంధం! యోగ్యమైనది కాదనుకున్నాడు కామయ్య, దానికి కారణం తనకేమీ డబ్బు దక్కదన్నదే ప్రధాన కారణం. పైకి ఏవో కారణాలు వెదుకుతాడు. ఆ కుర్రవాడే ఆ కుటుంబంలో పెద్దవాడు. వాడి తర్వాత నలుగురైదుగురు కొడుకులున్నారు. ఈడూ, జోడూ కలిసిన సంబంధం కనక తనకేమీ కిట్టదని అతని లోపలి దిగులు. కాని పైకి మాత్రం మరీ చిన్నవాడు - కనుక గుటుక్కుమంటే తర్వాత పిల్ల తమ ప్రాణాలకు పడి ఉసూరుమంటుందన్న తర్కం అడ్డం పెట్టుకుని-నేడో రేపో చచ్చే ముసిలి వాడిని వరునిగా ఎన్నిక చేస్తాడు. పెద్దింటి పెద్దయ్య సంబంధం అన్ని విధాలా యోగ్యంగా తోచింది. అతని భార్య చనిపోయింది. వేయిరూపాయలు ఆభరణాలుంచుతారు. వీలయినంతా లాక్కోవచ్చు. అదీ కామయ్య కుతంత్రం!

ఈ విషయంలో జరిగిన సంభాషణ గమనించదగ్గది:

**అజ్ఞానమ్మ:** ఇదెక్కడి సంబంధం దొరికింది? పెళ్ళికొడుకుకు ఇది నాల్గోపెళ్లి! వయసుకా మావారికంటేను చాలా పెద్దవాడు. అంతకన్నా నా మేనల్లుడికియ్యరాదా? వాడికి నలభయి ఏళ్ళయినా నిండలేదు.

**పిచ్చయ్య:** (తనలో) పెద్దయ్యగారికి వివాహ మహోత్సవం కంటే దినవార మహోత్సవం చేస్తే బాగా ఉంచుంది.

**పుల్లయ్య:** (పిచ్చయ్యతో రహస్యంగా) పెద్దయ్య పెళ్ళి పల్లకీ ఎక్కడం కంటే ఏడుకట్ల పాలకీ ఎక్కి ఊరేగితే దివ్యంగా ఉంటుంది.

ఇంతగా వ్యతిరేకించినా కామయ్య చిట్కాతో భార్య లొంగిపోయింది. పెద్దయ్యకు పిల్లనివ్వడం ఆస్తిపాస్తులు లాక్కొందుకే తప్ప కూతురు దాంపత్యసుఖం కోసం ఎలాగూ కాదని అంతా అంగీకారానికి వస్తారు. అజ్ఞానమ్మకు నగలు వస్తాయని, పిల్లనిస్తే పెద్ద మొత్తమందుతుందని ఆశ!

సమయానికి వచ్చిన వైదిక స్వాములిరువురూ డబ్బు పుచ్చుకొని పిల్లనివ్వడం వేదశాస్త్ర సమ్మతమే కాని పాపంకాదని తేలుస్తారు, అయినా కామయ్య ముదలకించి - "పెద్దలిందరూ కన్యాశుల్కం కూడదంచారు. ఎందుచేత?" అని అడుగుతాడు. ఈ ప్రశ్న ధర్మ సందేహనివృత్తికి కాదు. తన నిర్ణయాన్ని బలపరుచుకునేందుకే. కన్యాశుల్కం అనే పదబంధం తెలుగు సాహిత్యంలో ప్రథమంగా ప్రవేశించినది ఇక్కడే.

శాస్త్రి సోమయ్య లిరువురునీ పెద్దయ్య దగ్గరకు వెళ్ళి బేరం కుదుర్చుకు రమ్మని కామయ్య ఇదివరకే పంపించాడు. వారు కార్యసిద్ధితో తిరిగి వచ్చారు. సోమయాజి పెద్దయ్యతో సంబంధం బలపరుస్తూ ఇలా అంటాడు. "మీ దంపతుల పుణ్యం వల్లనే ఇటువంటి అల్లుడు మీకు లభ్యమయినాడు కానీ మరి ఒకటి కాదు". అది కూడా నీతి పరుల పొగడ్త. కోర్టులో దొంగసాక్ష్యం పలకవలసిన పనిఉండి వారిరువురూ నిష్క్రమిస్తారు. దానితో ప్రథమాంకం ముగుస్తుంది.

డబ్బై ఏళ్ళ పెద్దయ్యకు మూడేళ్ళ కుర్రముండ చిన్నమ్మనిచ్చి పెళ్ళి చేయడానికి పూర్వరంగం సిద్ధమయింది.

**పురోహిత వర్గం:-**

వీరేశలింగం మహాద్రష్ట. 120 సంవత్సరాల క్రిందటే బ్రాహ్మణ సమాజాన్ని సజీవంగా చిత్రించాడు ఈనాటకంలో. హిందూ సమాజ శ్రేయఃకాములై ముందుకు నడిపించవలసిన పురోహిత వర్గం గర్భ కక్కుర్తికి లోనయిపోయింది. డబ్బుకోసం ఎలాంటి గడ్డి కతకడానికయినా సిద్ధపడుతుంది. కూటనీతితో నైతికంగా పతనమైపోయింది. ప్రతి చెత్త ఆచరణలకీ స్మృతిశ్రుతుల ఆధారంగా ఉన్నట్లు సిద్ధాంతం చేస్తూ పబ్బం గడుపుకుంటుంది. తద్వారా వైదిక ధర్మం పట్ల తమకే విశ్వాసం లేదని ఆచరణలో ధ్రువ పరుచుకుంటుంది. ఇదే పరిస్థితి నేటికీ కొనసాగుతూనే ఉంది.

మను ధర్మశాస్త్రం పన్నిన కుట్ర ద్వారా మెట్లు మెట్లుగా కట్టిన హిందూ సమాజానికి బ్రాహ్మణ్యం శిఖరాయ మాణమైనది. అదే భ్రష్టాచార పరాయణమైనప్పుడు మిగిలిన అడుగు మెట్లన్నిటి పైనా కీడు నీడలే ప్రసరిస్తాయి. సమాజాగ్రేసరులే ఇంతగా పతనమై పోయినపుడా జాతి సమగ్ర స్వరూపం ఎంత భయంకరంగా ఉంటుందో ఆలోచించవలసింది ఆధునిక మేధావులు. అంతే తప్ప దళిత మేధావులెవరో ఇటీవల ప్రచారం చేసినట్లు వీరేశలింగం కాని - గురజాడ కాని, కేవలం బ్రాహ్మణ సమాజ పక్షపాతం తోనే తమ సాహిత్యాన్ని వెలయించలేదు. సంఘసంస్కరణ ఉద్యమాన్ని ఆసంకుచిత పరిధిలోనే నడిపించనూ లేదు.

అవసరార్థం జాతకాలు మార్చి, తప్పుడు జ్యోతిష్యం రాయించుకుని పెద్దయ్య పెళ్ళిముస్తాబు ఆర్భాటంగా ప్రారంభమవుతుంది. అతని మాటల్లోనే.

పెద్దయ్య: నీచ స్థానంలో ఉన్న గ్రహాలన్నిటినీ ఉచ్చస్థానంలో వేసి ఇప్పటికి నాకు నలభైఏళ్ళు హెచ్చు లేకుండా ఉండేటట్లు "పుట్టిన సంవ్వాత్సరం" మార్చి జాతకం రాసి తీసుకుని రమ్మని బొజ్జయ్య సిద్ధాంతికి ముందుగా నిన్ననే పదిరూపాయలు చేతిలో పెట్టినాను.

డబ్భై ఏళ్ళు దాటినవాడు నలభై ఏళ్ళవాడిలా కనిపించే ఏర్పాటు బాగానే ఉంది. కాని అతగాడికే సందేహం వచ్చింది. "చేతనైన పని ఏళ్ళు తక్కువ వేసి జాతకం దిద్ది రాయగలరు. గాని భగవంతుడు చేసిన ముసలి తనాన్ని ఆయన ఏమి చేయగలడు?" అన్న పెద్దయ్య మాటలకు సోమయాజులు ముఖస్తుతి చేస్తూ ఉపాయం చెబుతాడు. పెద్ద పండితుల వలెనో, శాస్త్రజ్ఞుల వలెనో నటించే ఇలాంటి మనుషులు డబ్బుకోసం నానా దుగుల్బాజీ పనికి సిద్ధమౌతారు.

ఇంత సరంజామా చేసినా పెద్దయ్య మంగళ స్నానాల సమయంలో చలికి కొంకర్లెత్తి నేల వాలిపోయాడు. అందరూ గొల్లుమంటూ పరుగులు తీస్తారు. మధ్యలో గుంజ ఏడ్చినట్లు పనిమనిషి, కన్నమ్మ రాగాలు పెడుతుంది.

ఆశయ ప్రేరణే ప్రధాన చోదక శక్తి అయినప్పుడు ఎంత గొప్ప ద్రష్టకయినా పాక్షిక దృష్టి తప్పదు. ఆ లోపం వీరేశలింగం గారికి తప్పింది కాదు.... పెళ్ళి పూర్తికాగానే పెద్దయ్య తన ఇంటివద్ద భోగంమేళం పెడతాడు. ఆ మేళంలోని సానుల పేర్లు - బట్టతల అలివేణి, సొట్టకాలి హంసయాన, చికిలికన్నుల చకోరాక్షి, నత్తినోటి మంజుల వాణి - వగైరాలుగా పేర్కొని సాని మేళాల పట్ల తనకున్న వ్యక్తిగత విద్వేషాన్ని వ్యక్తం చేస్తాడు. భోగంమేళం రసికులు నానా భ్రష్టాచారంగానూ నిచంగానూ వ్యవహరిస్తారు. ఇరవయ్యో శతాబ్ది నాలుగో దశకం వరకూ భోగంమేళం లేని పెళ్ళి పెళ్ళేకాదు. ఆ దుష్టాచారం మన దేశంలో ముఖ్యంగా చిన్న బస్తీల్లో కొనసాగుతూనే వచ్చింది.

చతుర్థాంకమంతా బ్రాహ్మణ్యం సంభావనలు కోసం-ప్రదర్శించే దుష్టత్వం చిత్రించబడింది. అదంతా వాస్తవమే కాని కల్పన కాదు. తీసుకున్న వాళ్ళే గోడదూకి వచ్చి దొడ్డి సంభావన వరుసల్లో నిలబడతారు. దీనితో పెద్ద దొమ్మి జరుగుతుంది.

పంచమాంకం పెళ్ళి భోజనాల రభస. మళ్ళీ మళ్ళీ పిలిపించుకోడాలు, బెట్టులు బెదిరింపులు అంతా అసహ్య వాతావరణం. అక్కడక్కడా నేటికీ మిగిలి ఉంది.

ముసలి పీనుగల కెంత సిగ్గులేదో! జనం గొణుక్కోవడం పెద్ద భాగోతం అన్ని ఏర్పాట్లు పూర్తయ్యేసరికి మబ్బులు కమ్మి చినుకులు ప్రారంభమయ్యాయి. పెళ్ళికూతురు పాలయినా వదలని చంటిముండ! ఎక్కడ పడుకుని నిద్రపోయిందో సమయానికి

కనిపించదు. ఊరేగింపు సాగనారంభించేసరికి పెద్దవర్షం. అజ్ఞానమ్మకు తేలుకుట్టడం! రసాభాసుగా అసంపూర్ణంగా ముగిసిపోతుంది.

అదే అంకం - రెండో రంగం పెళ్ళికొడుకు యిల్లు. దండాడిపు ఏర్పాట్లు. వంట బ్రాహ్మలు పెళ్ళికొడుకుని, పెళ్ళి కూతురినీ ఎత్తుకొని బాజాల కనుకూలంగా గెంతుతూ బుక్కా బగ్గుండా జల్లుకుంటారు. చుట్టాలు వరసయిన వాళ్ళూ వసంతాలూ జల్లుకుంటారు. అదో పెద్ద అల్లరి! సమవయస్కులైన వధూవరులున్న సందర్భంలోనే సాధారణంగా సరసం విరసమైపోతుంది. వంట బ్రాహ్మలిద్దరూ పోటాపోటీలు పడి పెద్దయ్యను నేలపై ఎత్తేస్తారు. మొకాలు చిప్ప కొట్టుకుపోతుంది.

సప్తమాంకమే బ్రాహ్మ వివాహానికి పరాకాష్ట. మొదటి దృశ్యం కామయ్య అజ్ఞానమ్మలు జనాంతికంగా తమ ఆర్థిక యిబ్బందులు ముచ్చటించు కుంటారు. "పెద్దయ్య గారిని మళ్ళీ ఏమైనా యిమ్మని అడగండి!" అంటూ అజ్ఞానమ్మ సలహా. కామయ్య తనలోని నైచ్యానికి తెరమరుగైనా లేకుండా బయట పెట్టుకుంటారు. లేకలేక పుట్టిన కూతురు బతుకు సర్వనాశనం చేశామన్న మానుషత్వం ఏ కోశానా కనిపించదు. ధనాశ ఎంత నికృష్టంగా నడుపుతుందో! అతని మాటలు ఇలా సాగుతాయి:

**కామయ్య:** పెళ్ళయిన నాలుగేళ్లలోను లక్షసార్లు అడిగాను. ఒక్క గవ్వయినా పెట్టిన పాపాన పోయినాడు కాదు. వాడు ఒట్టి మలభక్షకుడు. ఎన్నివిధాల అడిగినా ఇయ్యక పోతినే కదా ముసలి ముండా కొడుక్కి తగిన ప్రాయశ్చిత్తం చేద్దామని వెండి చెంబుల జోడు నిముషంలో మాయంచేసినాను. అయినా అతను మనమీద మాత్రం అనుమానపడలేదు. అతడింతకాలం బ్రతుకుతాడని తెలిస్తే మాత్రం నేనప్పుడు పిల్లనిస్తునా! (ఈ చివరి మాటలోనే ఉంది. కామయ్య ఆర్థిక ప్రణాళిక అంతా! కూతురు ముండమోస్తే వాడకేం నష్టం! ఆడదీ ఒక మనిషేనా?)

**అజ్ఞానమ్మ:** జరిగిపోయిన దానికి విచారించి చేసే కార్యం ఏమీలేదు. ఇకనైనా పెద్దయ్య వేగిరం చస్తే బాగా ఉండును. పిల్లది ఎదిగి డబ్భై ఏళ్ళ ముండాకొడుకుతో కాపురం చేసి ఏడుస్తుందా ఏమిషి?

పెద్దయ్య ఇంటిలోనే ఉంటూ అతని తిండి తింటూ చివరకీ మనుషులిద్దరూ అతడి చావునే అమానుషంగా కోరుతున్నారు. డబ్బే సర్వనిర్ణాయక శక్తిగా రాక్షసమనస్తత్వాన్ని నిర్దయగా బయట పెడుతుంది. ఇది మన తాత్విక సంపద పలికించిన సంస్కృతి! బ్రాహ్మణాధిక్య, పురుషాధిక్య, ధనాధిక్య, సమాజపు తీరు తెన్నులెంత నికృష్టంగా ఉండగలవో వీరేశలింగం లోతుగా పరిశీలించాడు.

అదే అంకం రెండో దృశ్యం. చాలా రోజులు గడిచాక జరిగిన సంఘటన. పైడిపాటి

పాపావధానులు, బంధకవి భానుమూర్తి అనే వ్యక్తులు కలిసి మాట్లాడుకుంటారు. ఇంటిపేరులని బట్టి మొదటివాడు వైదీకి అని రెండవవాడు నియోగి అని తెలస్తూనే ఉంది. "వంట చేసిన తలవెంట్రుకుల వెధవ ఎవరోకాని పాకం దివ్యంగా చేసింది సుమండీ!" అంటూ మెచ్చుకుంటాడు భానుమూర్తి. పాపావధానులు వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తాడు. ఆవిడ ఒక్క పాకం మాత్రమే కాదు, అన్నీ మీవంటి వారికనుకూలంగా ఉండే లాగున చేస్తుంది. పెద్దింటి పెద్దయ్యగారని చెప్పు కోవడం వినలేదా?

**భాను:** విన్నాను. ఆయన గొప్ప భాగ్యవంతుడు కదా? ఆయన పోయినాడట భార్య ఎక్కడుంది?

**పాపా:** మీరిప్పుడు శ్లాఘించిన తలవెంట్రుకల వెధవ పెద్దయ్యగారి భార్య!.... ఈవిడ పూర్వం అటుకులు కొట్టుకుంటూ ఉండేది. సహ్వాత్సరం నుంచి వంటపూటితనం చేసుకుంటూ ఉన్నది.

భానుమూర్తికి సహజంగా కుతూహలం కలుగుతుంది. అంత ధనికుని భార్యకి ఇలాంటి గతి ఎందుకు పట్టిందో తెలుసుకోగోరతాడు. పాపావధానులు వివరిస్తాడు. పెళ్ళి అయినాక పెద్దయ్య పదేళ్ళు బ్రతికాడు. కాని ఈమె ఈడేరి అతని అక్కర తీర్చలేదు. ప్రతిరోజూ మినపసున్ని పెట్టి కూతుర్ని బలిపించినా లాభం లేకపోయింది. పెద్దయ్య మరో యేడాదికి పోతాడనగా రజస్వల కాకముందే గర్భాధానం జరిగింది. పునస్సందాన మైన రెండు మాసాలకల్లా ఈమె సమర్తాడింది. శక్తివంచన లేకుండా సంతానం లేకుండా సంతానం కోసం బయటపాటుపడి, మొగుణ్ణి పున్నామ నరకం నుంచి తప్పించడానికే ప్రయత్నించింది. భార్య సమర్తాడిన మర్నాటి నుంచీ భార్య యొక్క నవ్వుమొగం చూసినపుడెల్లా తెల్లతెల్లబోతూ, ఆవిడ యౌవనం తలచుకొని దిగులు పడుతూ, బెంగపెట్టుకుని, ఆదినానికాదినం క్షీణించి, దేహమంతా పాలిపోయి భార్య యొక్క పరోపకారం చూడలేక సాధ్యమైనంత శీఘ్రంగానే పెద్దయ్య లోకాన్ని విడిచిపెట్టినాడు.

జరిగిన కథా పర్యవసానం ఎంత ఘోరమయిందో!

అతని మరణానంతరం పెద్దయ్యగారి జ్ఞాతులు దావా తెచ్చారు. వ్యాజ్యం విమర్శకు వచ్చినపుడు పాత మునసబుగారు న్యాయం వేలం పాడించి పెద్ద పాటమీద కొట్టివేయడానికి నిశ్చయించుకున్నారు. ఆ విధంగా డబ్బు ఖర్చు చేయగలిగిన వాళ్ళ పక్షం మున్సబు తీర్పు యిచ్చి చిన్నమ్మకు ఆస్థితి కలిగించాడు. ఆమె తరపున వాదించిన ప్లీడరు వయసులో ఉన్నవాడు. ఆరంభ యౌవనంలో ఉన్న చిన్నమ్మ శరీరాన్నే ఫీజుగా వాడుకున్నాడు. వ్యాజ్యం తీరకముందే చిన్నమ్మకు పుత్ర సంతానం కలిగింది.

"ఈ ప్రవాదం కలిగిన కాలంలోనే చిన్నమ్మ ఇంటికి ఎదురుగండా ఉన్న చెరువు గట్టుమీద చంపబడ్డ అప్పుడే పుట్టిన పురుష శిశువు ఒకటి కనబడ్డది. ఆ శిశువు ముఖాన్ని సందేహం లేకుండా చిన్నమ్మ ముఖం పోలిక కూడా కొంచెం కలిగి వున్నది." అంటూ పాపావధానులు పాతకథ ఏకరువు పెట్టాడు.

పెద్దయ్య ఆస్తి చిన్నమ్మకు సంక్రమించింది. తల్లితండ్రులు తిన్నంతతిని గతించారు. స్థిరాస్తి అమ్మివేసింది పరోపకారార్థ మిథం శరీరమన్నట్లుగా బ్రతికేది. ఆమెను చేరిన ఒక స్నేహితుడు ఆమె ధనమంతా అపహరించాడు. దానితో గడుసుబారి స్నేహితులకు తావివ్వక వారినుంచి కొంచెం కొంచెంగా తానే తీసుకో నారంభించింది. తన వృత్తికి అనుకూలంగా ఉండడానికే పూటకూళ్లమ్మగా వృత్తి మార్చుకుంది. ఈ నిరతాన్న దానంలో కీర్తి సాధించింది. ఎంత దూరాన్నుంచైనా ఈఆమెను చూడటానికి వచ్చి సత్కరించి పోతూంటారు. పైగా యిప్పుడామెకు వైద్యులు కూడా మిత్రులయ్యారు. వారు తమ యావచ్ఛక్తినీ వినియోగించి- ఆమెకు శిశుహత్య వల్ల దోషం కలగకుండా పిండాన్ని జీవం రాకముందే గర్భనరకం నుంచి తొలగించి భూభారాన్ని తగ్గిస్తున్నారు. పైగా ఆమె పదిమందిలోనూ యిప్పుడు మహాపతివ్రతగా ఎంచబడుతున్నది.

"పితృకార్యాలు చుట్టుపట్ల ఎవరి యింట వచ్చినా ఆమెనే వంటకు పిలుచుకు పోతారు. పితృ దేవతలకు గతులు నిలుపుకుంటున్నారు. ఆమె నీతులు వర్ణించడంలో దిట్ట. లోకంలోని సంసారస్త్రీలు వ్యభిచారం చేత పాడవుతున్నారని, వారిని శిక్షించే నాధుడు లేక లోకం చెడిపోతోంది!" అని చెబుతూ వుంటుంది.

చిన్నమ్మ పావనగాథనంతా పాపావధానులు వివరించాడు.

భానుమూర్తి ఉండబట్టలేక యిలా అంటాడు. "ఇటువంటి కష్టాలన్నీ - తల్లి తండ్రులు డబ్బుకాశపడి కడుపున పుట్టిన బిడ్డలను ముసిలివాళ్లకు కట్ట బెట్టడం వల్లనే కలుగుతున్నవి. కన్యాశుల్కం పుచ్చుకునే వారిని పదిమందీ చేరి వెలివేస్తే బహునష్టాలు మాసిపోతవి!" ఆనాటి సమాజాన్ని పరిశీలించినందువల్ల కలిగే తీర్పే యిది.

పాపావధానులు మళ్ళీ ప్రారంభించి చిన్నమ్మ సుగుణాలు మరికొన్ని వివరిస్తాడు. "దేహ పటుత్వమున్న పని కత్తెలను పెట్టి - ఇరుగు పొరుగు స్త్రీలకు కూడా వేదాంత ధర్మాలు ఉపదేశించి, వారినీ తన మార్గానికి దింపి పరోపకార పారీణురాళ్ళను గాను, ధనికురాళ్ళను గానూ చేస్తూ ఉన్నది" అంటూనే పాపావధానులు ఎంత కక్ష వెల్లగక్కినా లోక ధర్మాన్ని యిలా ప్రదర్శిస్తాడు. "ఈ కలికాలంలో కన్యావిక్రయం మాన్పించడానికి ప్రయత్నం చేసే వారెవరు? పెద్దలందరూ తమకది లాభకరమైన పనిగా గ్రహించి యీ ఆచారాన్ని వృద్ధి పొందించడానికే చూస్తున్నారు! ఇక చిన్నవాళ్ళ మాటలు వినేవాళ్ళెవరు?"

పూటకూళ్ళ చిన్నమ్మ రంకు పురాణం తెలియక తాను దారితప్పి వచ్చానని ప్రాయశ్చిత్తం చేసుకుంటానని భానుమూర్తి సెలవు తీసుకుంటాడు. పెద్దయ్య పెళ్ళి ప్రహసనం సమాప్తమవుతుంది. 1878లో పాపావధానులు అడిగిన ప్రశ్నకు మరో పదేళ్ళ తరవాత - మద్రాసు లెజెస్లేటివ్ కౌన్సిల్‌కు ఆనందగజపతి మహారాజు సభ్యులుగా నామినేట్ చేయబడిన తర్వాత తీవ్ర ప్రయత్నం చేశారు. కాని అప్పటికీ యింకా పెత్తనం వహిస్తున్న సనాతనులు- వారు ప్రవేశ పెట్టిన బిల్లును చిత్తు చేసి పారేశారు. అందుకే పబ్లిక్ ఒపీనియన్‌ను కేంద్రీకరించడానికని మహాకవి గురజాడకు కన్యాశుల్కం నాటకం రాయమని ప్రోత్సహించారు.

బ్రాహ్మవివాహాన్ని గురజాడ తన పదహారో ఏట చదివారు. క్షుణ్ణంగా చదివి అనుకూల భావాలు పెంచుకున్నారు తర్వాత ఆయన కేంద్రీకరణ ఆంగ్ల సాహిత్య అధ్యయనం పై నిలిచింది. షేక్స్పియర్ నాటకాలన్నీ క్షుణ్ణంగా చదివారు. షెరిడన్ ప్రభృతులను చదివారు. ఆంగ్ల భాష ద్వారా అందిన మోలియర్ వంటి ఫ్రెంచి మహారచయితలను చదివారు. నాటక కళను సంపద్వంతంగా నిర్వహించే నేర్పు అలవర్చుకున్నారు. ఐనా 1891లో రచించిన కన్యాశుల్కం - "గనిలోంచి వచ్చిన ముడి పదార్థం గానే మిగిలింది తప్ప స్వచ్ఛ సువర్ణ" కాలేకపోయింది. ఐనా ప్రదర్శనం ఎంతో విజయవంతమైనట్లు ఆనాటి ప్రముఖ పత్రికలన్నీ రాశాయి. గ్రంథం మాత్రం గురజాడకు తృప్తి నివ్వలేదు.

దేశంలోని వివిధ నాటక కంపెనీలు పుస్తకాన్ని అచ్చువేసి తమకూ ప్రదర్శించే సదవకాశం కలిగించమన్న ఒత్తిడి ఎక్కువైంది. దానితో చిన్నచిన్న మార్పులు చేసి - 1897లో అంటే ప్రథమ ప్రదర్శన జరిగిన ఐదు సం॥రాలకు గ్రంథంగా అచ్చువేశారు. గురజాడకు తృప్తి కలగక 12 సం॥రాలు దాని పునర్నిర్మాణానికి శ్రద్ధతో కృషిసల్పి - 1909లో అనర్ఘరత్నం వంటి కన్యాశుల్కం ద్వితీయ రూపాన్ని, అద్వితీయ సుందర మూర్తిగా దేశానికి సమర్పించారు.

ఐతే కన్యాశుల్కం ప్రథమ ముద్రణ (1897)కు ముందుమాట ఆంగ్లంలో రాస్తూ గురజాడ యీ ముగింపు మాటలతో ముక్తాయించారు.

" Recently, I happened to read Brahmavivaham by Raj Bahadur Veeresalingam Pantulu garu and found that there were some Paralelled Passages In our plays, a thing perfectly natur at considering that his peice traversed the whole field of Brahmin marriages. But will be seen that these plays have little else in common, our treatment being sentially different. Brahma Vivaham was ment to be a pure comedy of manners, while in Kanya Sulkam humour, Characterization and the construction

of an original and complex plot success. It is for the public to Judge."

అంటూ నమ్రతతో ముగించినా - యింత తర్కబద్ధమైన సంజాయిషీ గురజాడ యిచ్చినా - కన్యాశుల్కం ప్రథమ ముద్రణ ఆయన చెప్పుకున్న గుణాలతో భాసించనేలేక పోయింది. బ్రాహ్మ వివాహం కేవలం హస్య నాటకం (లేదాప్రహసనం) కాదు; కన్యాశుల్కం సంపూర్ణ నాటకీయలక్షణాలతో తులతూగనూ లేదు. "బ్రాహ్మ వివాహం" ఏ పూటకూళ్ళమ్మ వ్యవహారంతో ముగిసి పోయిందో- కన్యాశుల్కం అదే పుటకూళ్ళమ్మ వ్యవహారంతో ప్రారంభమై బ్రాహ్మ వివాహానికి కన్యాశుల్కం పొడిగింపు మాత్రమే ననిపిస్తుంది.

ఐతే వీరేశలింగం కర్మవీరుడు. గురజాడ స్రష్ట. ఆంగ్ల నాటకాలతో గాఢ పరిచయం కలవాడు. ఆ ప్రజ్ఞా విశేషాలన్నీ ద్వితీయ ముద్రణకోసం పునర్మించిన రూపంలో ప్రదర్శించారే తప్ప ప్రథమ ముద్రణలో కాదు. పైన ఉల్లేఖించిన గురజాడ వాక్యంలో "నేనిటీవలనే బ్రాహ్మ వివాహం చూడటం తటస్థించింది. అనడం సంగతం కాదు. అంత మాత్రంలో మహాకవికి అనృత దోషం ఆపాదించలేము. మనిషి ఎంత జ్ఞానార్జనాశీలి అవుతుంటే మరుపు కూడా అంత నిడివిలోనూ పెరిగే అవకాశం ఉందని మనస్తత్వ శాస్త్రం తెలుపుతోంది. మహాకవి గురజాడ ప్రథమ ముద్రణ ముందుమాటలో అంత దీర్ఘమైన వాక్యం రాసినా అది 'అసావాదిత్యో బ్రహ్మ' అని తలచుట్టూ తిప్పుకున్నట్లు వుంది తప్ప న్యాయసమ్మతంగా లేదు. మహాకవి విరచించిన కన్యాశుల్కానికి మహాపురుషుడు విరచించిన బ్రాహ్మ వివాహం మాతృత్వం వహించిందనడంలో మాత్రం సందేహం లేదు!

**(ఆంధ్రప్రదేశ్ 1994-జనవరి)**

# 4. గురజాడ సాహిత్య గంగకు భగీరధుడు అవసరాల

మహాకవి గురజాడ అభిప్రాయాలను ఆనాటికే కాదు. నేటికి సైతం వాస్తవికతా దర్శనంతో మొనతేరుతున్నవే! రాగల కాలాన్నీ, జరగవలసిన మార్పుల్నీ ముందుగా యోచించే, అవగాహన చేసుకొని దర్శించగలిగిన వారాయన. ఎంత ప్రతిఘటన ఎదురైనా, మొక్కవోని ధైర్యంతో సహేతుకంగా పోరాడిన ధీరుడాయన. నిశ్చయంగా క్రాంతదర్శి! త్రికాలవేది అనే పదానికి నిస్సంశయంగా అర్హుడు. ఆధునిక చైతన్యాన్ని సాహిత్య పరంగానూ, సామాజిక పరంగానూ ప్రదర్శించాడు. తనది ప్రజల ఉద్యమమన్న స్పృహ ఆనాటి గురజాడ మాత్రమే ప్రకటించగలిగాడు.

ఆనంద గజపతి మహారాజు అనంతరం, వారి సోదరి అప్పలకొండమాంబ గారి రీవా ఎస్టేట్ వ్యవహారాల కోసం ఆయన చరమ జీవితంలో అత్యధిక భాగం వెచ్చించ వలసి వచ్చింది. ఆవిధంగా ఎంతో అమూల్య కాలం వ్యర్థం కాక తప్పలేదు. ఈ గోల ఆయనపై పడి వుండకపోతే ఇంకా ఎంత ఉత్తమ సాహిత్యాన్ని జాతికి అందించగలిగే వారో! ప్రణాళిక సిద్ధం చేసుకున్న ప్రకారం గొప్ప నవల ప్రజలకందేది. అమూల్య బాల సాహిత్యం ప్రప్రథమంగా జాతికి లభించేది. కొండు భట్టీయం సంపూర్ణ నాటకంగా సకల కళా సంపన్నంగా ప్రసాదింపబడేది. నేడు మనకు మిగిలిన ఆ నాటకం సంపూర్ణ రచనకు చిత్తుగా అమర్చుకున్న అస్థిపంజరం మాత్రమే.

ఈ దురదృష్టాన్ని విస్మరించినా, గురజాడ సాహిత్యంలో అత్యధిక భాగం తెలుగు జాతికి 1955 తర్వాతనే అందుబాటులోకి వచ్చింది. అంతవరకూ అది అదృశ్యమాన ఆకాశ గంగగానే గురజాడ వెంకట రామదాసు గారి ట్రంకుపెట్టెలో నిద్రపోతోంది. విశాలాంధ్ర ప్రచురణాలయం పక్షాన కార్యదీక్షతో కీ॥శే॥ అవసరాల సూర్యారావు - రామదాసు గారిని అభ్యర్థించి, నామకః మూల్యం చెల్లించి ఆ సాహిత్యాన్నంతటినీ సముపార్జించాడు.

అహోరాత్రాలు శ్రమించి శిథిలావశిష్టంగా ఉన్న కాగితాలను పేర్చుకుంటూ అపార సేవ చేసి గురజాడ సాహిత్య గంగను ప్రజలకందించిన అపర భగీరధుడు శ్రీ అవసరాల. అతనికి జాతి తరతరాలుగా కృతజ్ఞతలు సమర్పించుకోవలసి ఉంది. కాని దురదృష్టవ శాత్తూ అదే జరగడం లేదు. తెలుగుజాతి సహజ లక్షణమైన ఉదాసీనతతో పాటు, నేటి

విశాలాంధ్ర ప్రచురణాలయమూ ఆ సంస్థ నియమించిన వ్యక్తులూ ఈ దురదృష్టకర అంధ దృష్టికి కారకులవుతున్నారని నిశ్సంశయంగా చెప్పవచ్చు.

1948-52 నడిమి కాలంలో నెహ్రూ ప్రభుత్వం భారత కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. దారుణ రాక్షస నిర్బంధకాండకు కమ్యూనిష్టులందరినీ గురిచేసింది. ఎందరో ప్రజల వీరులు అమరులయ్యారు. రచయితలు, కవులుసైతం జైళ్ళలో బంధింపబడ్డారు. రోణంకి అప్పలస్వామి గారి ఆధ్వర్యంలో విద్యార్థిగా బి.ఏ. చదువుతున్న అవసరాల సూర్యారావు ఆరంభ యౌవనం నుంచీ పార్టీ సభ్యుడు కావడం వల్ల, మరీ ముఖ్యంగా సంచలనాత్మక రచయిత కావడం వల్ల డిటెన్యూగా కడలూరుకు పంపబడ్డాడు. డిటెన్యూలకు కలిగించవలసిన కనీస సౌకర్యాలు మృగ్యం కావడం వల్ల నిరశన వ్రతానికి పూనుకొని ప్రతిఘటించ పూనుకున్నారు. జైలు అధికారులీ ధిక్కారాన్ని సహించలేక ఖైదీలపై అమానుషంగా కాల్పులు ప్రారంభించారు. మహనీయుడు డాక్టర్ చెలికాని రామారావు గారిపై గురిచేయబడ్డ తుపాకిని చూసి ఆయన్ను రక్షించాలన్న సంకల్పంతో శ్రీ అనుమర్లపూడి సీతారామారావు ఆయనకు అడ్డంగా వచ్చి నిలిచాడు. తుపాకులు పేలనారంభించాయి. అనుమర్లపూడి అమరుడయ్యాడు. సరిగ్గా అదే సమయంలో అవసరాల ప్రక్కనే నిలిచిన, అపార దేశ భక్తుడైన ఒక తమిళ కామ్రేడ్ తలలోంచి తుపాకి తూటా దూరిపోయింది. దూసుకుపోతూ కపాలాన్ని రెండుగా చీల్చింది. మెదడు నేలపై కూలిపోయింది. ఈ భయంకర దృశ్యాన్ని సన్నిహితంగా వీక్షించిన సుకుమార హృదయుడు అవసరాల మనస్సు తక్షణం వికలమైంది. ఉన్మాదావస్థ ఆవహించింది. ఈ మానసిక రోగిని మద్రాసు పెనిటెన్సరీకి ప్రభుత్వం తొలగించి వైద్యం చేయించింది. ఒక ఏడాది కాలం ట్రీట్‌మెంట్ జరిగాక ఆరోగ్యం పునరుద్ధరింప బడి అవసరాల విడుదలయ్యాడు. విశాలాంధ్ర పత్రికా, ప్రచురణాలయమూ స్థాపించబడ్డాయి.

విశాలాంధ్ర పత్రికలో సహాయ సంపాదకుడుగా అవసరాల పనిచేయ నారంభించాడు. తానుగా చొరవ తీసుకొని, ప్రచురణాలయం కోసం మహాకవి పుత్రుడు రామదాసు గారితో సంప్రదించి గురజాడ రచనల ట్రంకుపెట్టి సంపాదించి, ముద్రితా ముద్రిత సర్వ రచనలపైనా ప్రచురణ హక్కులు సాధించాడు అవసరాల. పరిష్కరించే సంపాదక బాధ్యతలను తానే స్వయంగా స్వీకరించాడు. పత్రిక ఉప సంపాదకుడిగా అవసరాలకు ఎంతో అల్పవేతనం లభించేది. అతనికీ, కుటుంబానికీ తిండికే సరిపోయేది కాదు.

అతి పరిమితమైన సొంత వనరులతో, జింఖానా క్లబ్ సమీపంలోని అతి హాస్యాస్పదమైన అద్దెకొంపలో జీవించేవాడు. విద్యుద్దీపాలు లేవు. కిరసనాయిలు సమృద్ధిగా దొరకదు. ముట్టుకుంటే పొట్టుపొట్టుగా రాలిపోయే కాగితాల కవిలకట్టలు. కోడిగుడ్డు

దీపం సహాయంతో అర్ధరాత్రి వరకూ కూర్చుని, గురజాడ రచనలు పరిశోధించి ఎత్తి రాయనారంభించాడు. ఆంగ్ల రచనలకు అనువాదాలూ చేయాలి. అవసరాల ఎంతకష్టానికీ, క్లేశానికీ గురయ్యాడో చెప్పలేం! ఆ విధంగా గురజాడ రచనలను పరిష్కరిస్తుండగా ఒకనాడు తొందరగా ఆఫీసుకు నడిచి వస్తున్న సమయంలో ఎవడో దుర్మార్గుడు వెనకనుంచి సైకిలుపై వచ్చి ఢీకొట్టాడు. కుప్పకూలిపోయిన అవసరాలకు కుడిచేయి విరిగిపోయింది. సాహిత్యాభినివేశం ఎంత తీవ్రంగా వేధించినా కడుపు గోల తప్పని పరిస్థితి. కుటుంబ పరిపోషణకే జీతం చాలడం లేదు. అట్టి స్థితిలో చేయికి వైద్యసహాయమొకటి. విరిగిన కుడి చేతితోనే విశాలాంధ్ర ఉప సంపాదకులుగా పగలంతా పని. రాత్రి తెల్లవార్లూ కూర్చుని ఎడమచేత్తో రాయడం నేర్చుకుంటూ మహాకవి రచనలను పరిశుద్ధ రూపాలుగా తీర్చిదిద్దడం.! ఇంతటి దుస్థితిలో ఆ మహత్కార్యాన్ని సాధించడం ఎంతటి కార్యదీక్ష ఉంటే సాధ్యమో ఆలోచించ గలిగే వారికి అవగతమౌతుంది.

సరిగ్గా ఇదే విష్కంభంలో విశాలాంధ్ర సంపాదకులు శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు అవసరాలను పని చేయలేకపోతున్నాడన్న మిషపై ఉద్యోగం నుండి తొలగించారు. అప్పటి విశాలాంధ్ర బాధ్యులు శ్రీ మోటూరి హనుమంతరావు అది అన్యాయమనీ అలా చేయరాదని ఎంత తీవ్రంగా ప్రతి ఘటించినా చంద్రం గారు వినిపించుకోలేదు.-ఈ విషయాలకు ప్రత్యక్ష సాక్షిగా శ్రీ యేటుకూరి బలరామమూర్తి గారే నాకిటీవల వివరించారు.

అప్పటికే ఆమూలాగ్రం పరిశోధించి, విపులీకరించి పరిశుద్ధ ప్రతిని రూపొందించిన శ్రీనాథ మహాకవి విరచిత పలనాటి యుద్ధం గ్రంథాన్ని మోటూరి హనుమంతరావు గారే విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి సిఫారుసు చేసి ప్రచురణకి స్వీకరింపజేసారు. ఈ విషయంలోనూ అవసరాలకు మరో దురదృష్టమే ఎదురైంది. తాను రూపొందించిన పరిశుద్ధ పాఠానికి పండిత ఆమోదముద్ర లభించదేమోనని భయపడ్డ అవసరాల అప్పుడు బెజవాడలోనే ఉంటున్న ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారికి గ్రంథం చూపి ఆయనపేరు గ్రంథంపై వేసుకుందుకు అనుమతి కోరాడు. దానివల్ల పని యావత్తూ చేసిన అవసరాల సహాయకుని స్థానానికి చేరవలసి వచ్చింది. ప్రధాన సంపాదకుడిగా పింగళి వారు మెరవకనూ తప్పలేదు. ఇదీ చివరికి అన్యాయంగానే పరిణమించి విశాలాంధ్ర ప్రచురణాలయం వారి పారితోషికం అవసరాల కుటుంబానికి అందని దుస్థితి ఏర్పడింది.

దుస్సహ క్లేశార్ణవంలో ఈయన కేవల సంకల్ప బలంతో గురజాడ అమర సాహితీ గంగను తెలుగునేలపై ప్రవహింపచేసిన చరితార్థుడు. అవసరాలపై దాడితో కొందరు అతని మరణానంతరమూ వేధిస్తూనే వచ్చారు.

ఆచార్య రోణంకి అప్పల స్వామిగారికి విజయనగరంలోని శిష్యులంతా ఘన సన్మానం జరిపి ముఖ్య రచయితలందరినీ ఆహ్వానించారు. ఆ సభకి పురాణమూ వచ్చాడు

నేనూ వెళ్ళాను. అంత ఘనమైన సన్మానం రోణంకి వారికి జరుగుతున్న సందర్భంలో వారి ప్రియ శిష్యుడైన అవసరాలను స్మరించకపోవటం అన్యాయమనీ జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనానికి గురజాడ పేరు పెట్టిన సహృదయులు. ఆ గ్రంథాలయ సభా భవనానికి అవసరాల పేరు పెట్టాలనీ అవసరాల కీర్తిపై మురికి చల్లడానికి ప్రయత్నించిన కుతంత్ర వాదులకు అతని గురువుగారి సన్మాన సభలో పురస్కారం కలగడం కన్న అన్యాయంలేదని నా ఉపన్యసంలో ఉద్ఘాటించాను. పురాణం ఏదో సంజాయిషీ ఇచ్చుకుందుకు ప్రయత్నించాడు, కానీ రోణంకి వారు కిమ్మనకుండా ఊరుకోలేదు. వెంటనే లేచి "మిత్రుడు సోమసుందర్ చెప్పిన విషయాలు అక్షర సత్యాలు, అవసరాల సూర్యారావుపై అన్యాయ అభియెగాలతో దుర్మార్గంగా విరుచుకు పడిన విషయం మరువలేని దుస్సంఘటన" అని చెప్పి వూరుకున్నారు రోణంకివారు. పదివేల రూపాయల నగదు ఎందరో నూత్న వస్త్రాలు సమర్పించిన ఆ సన్మానానికి మళ్ళీవారు కృతజ్ఞత చెప్పడానికైనా లేవలేదు.

ఇన్నాళ్ళకి మళ్ళీ విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్ వారు గురజాడ సాహిత్య సమగ్రాన్ని పునర్ముద్రణకు పూనుకున్నారు. 1945లోనే గురజాడను తెలుగువారికి పరిచయం చేసిన శ్రీ సెట్టి ఈశ్వరరావును సంపాదకులుగా నియమించారు. ఆయన సామర్థ్యాన్ని సందేహించవలసిన పనిలేదు. అలాగే గురజాడపై గల భక్తి శ్రద్ధలూ శంకా రహితాలే. కన్యాశుల్కం ముద్రణకి సాధికారిక సకల విషయ విస్తరణతో గొప్ప పీఠికను సంత రించారు. కాని గురజాడ కవితల సంకలనానికీ, కథల సంకలనానికీ ఒకే పీఠికను పునర్ముద్రించడం మాత్రం ప్రశంశాపాత్రం కాదు. పైగా కథల విశిష్టతను గురించి ఏమీ చెప్పలేని భావ దారిద్ర్యం ద్యోతకం కావడం శోచనీయమే. ఈ పీఠికలలో అవసరాల సర్వమూ త్యాగం చేసి అందించిన అవిస్మరణీయ కృషిని శ్లాఘించడానికి పాపం ఆయనకి పదాలే కరువై పోయాయి. ఇది ఎలాంటినిజాయితీయో?

గురజాడ రచనల పరిష్కారం కోసం అవసరాల 1954నుండి 1958వరకూ నాలుగు సంవత్సరాలు అహర్నిశలూ కష్టపడి ముద్రణకు సంసిద్ధ మొనర్చాడు. అతని ఆరోగ్యం క్షీణించింది. నిష్కారణంగా చంద్రంగారు పత్రిక ఉపసంపాదక ఉద్యోగం నుండి తొలగించారు. మోటూరి వారు ఎంత చెప్పినా వినలేదు. ఆ స్థితిలో బ్రతుకు బరువు లీడ్వడం కోసం తనకు దక్కిన రెండెకరాల పొలం ఉన్నకాడికి అమ్ముకుని విజయవాడలో ప్రెస్సు నెలకొల్పాడు. దానికీ నిర్నిరోధక నష్టాలు రానారంభించాయి. హీనక్రయాని కమ్ముకొవి ఆంధ్రప్రభలో సహాయ సంపాదకునిగా ఉద్యోగంలో చేరాడు. విజయనగరం వెళ్ళి వస్తూ పిఠాపురంలో మా యింట రెండు రోజులాగాడు. పిఠాపురం మహారాజా శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు గారు మార్చి ఏడవ తేదీన కాలధర్మం

చెందారు. పదకొండో రోజున కోట ప్రాంగణంలో సంస్మరణ సభ ఏర్పాటు చేసి కంభంపాటి తారకం గారు నన్ను ఉపన్యాసానికి ఆహ్వానించి ఉన్నారు. ఆ విషయం అతనితో చెప్పి ఆపుచేశాను. సూర్యారావు తాతగారు అవసరాల పద్మరాజుగారు పిఠాపురం మహారాజా సూర్యారావు గారి తాత నీలాద్రి రాయణం గారికి దివాన్‌గా, ఆస్థాన కవిత్వ పరీక్షకునిగా ఉద్యోగం చేశారు. రావు వంశముక్తావళి అనే సంస్కృత కావ్యం రచించారు. అందుకు గాను ఐదువందల ఎకరాల భూమి దానం పొందారు. అందుకై కృతజ్ఞత చెప్పుకోదలచి సూర్యారావు ఉండిపోయాడు. సభ ఎంతో గొప్పగా జరిగింది. సూర్యారావును నేనే సభకు పరిచయం చేసి గత వంశ చరిత్రనంతా చెప్పాను. తర్వాత సూర్యారావు గొప్ప ఉపన్యాసం యిచ్చాడు. ఆ రాత్రి 11 గం॥లకు అతన్ని రైలెక్కించి వచ్చాను. 1963 మార్చి నెల 22వ తేదీన బెజవాడ చేరుకున్న రెండో రోజు డ్యూటీ చేసి వచ్చి నిద్రలో చనిపోయినట్లు ఆంధ్రప్రభ ప్రకటించింది. చదివి మ్రాన్పడి పోయాను.

సూర్యారావు హృదయంనిండా అంత కృతజ్ఞత ఉండగా అతనికి న్యాయంగా అందవలసిన కృతజ్ఞతలను మాత్రం మిత్రులనుకునేవారే అందకుండా చేశారు. ఈ కృతఘ్నతను చరిత్ర క్షమించదు. గురజాడ సాహిత్య గంగను తెలుగు నేలపై ప్రవహింప చేయడానికి అవసరాల ఎంత క్లేశలనుభవించాడో ఈ వ్యాసకర్త ప్రత్యక్షసాక్షి. జీవితాంతం సొట్టచేతితో వ్రాయలేక ఎడమచేతి తోనే రాత సాగించాడు. జైల్లో దెబ్బతిన్న ఆరోగ్యం గురజాడ సాహిత్య దీక్షలో పూర్తిగా కొడిగట్టింది.

భారతగాధలో మహారధి కర్ణుని దుర్మరణం గురించి ఒక చాటువు చెప్పారు పెద్దలు! "నరవర నీచేనాచే వరమడిగిన కుంతిచేత భార్గవుచేతన్, ధరచేశల్యునిచేతను అరయంగా కర్ణుడీల్గె ఆర్గురిచేతన్" అన్నట్లుగా సూర్యారావు సాహితీ వ్యక్తిత్వానికి ఎందరో అన్యాయం చేశారు. అతని చరిత్రను విస్మరణీయం చేయాలని బుద్ధి పూర్వకంగా కృషి సల్పుతున్నారు.

సెట్టి ఈశ్వరావు పునః పరిశీలనతో వెలువడుతున్న గురజాడ రచనలలో అవసరాల పేరు పూర్తిగా తుడిచిపెట్టే ప్రయత్నం విజయవంతంగా జరిగింది. కాని ఆ గ్రంథాలలో ముఖ్యంగా వ్యాస సంకలనంలో అవసరాలకు కనిపించని కొత్త విషయాలు కాని, గొప్ప విషయాలు కాని లేనేలేవు. అవసరాల సంపాదకత్వంలో ఆనాడు వెలువడిన వ్యాస చంద్రిక గ్రంథంతో యీ వ్యాస సంకలనాన్ని తులనాత్మకంగా పరిశీలిస్తే తెలుస్తుంది. ఆ గ్రంథం అస్మదాదులపై కలిగించిన సత్ప్రభావాన్ని విస్మరించి ప్రస్తుత గ్రంథాన్ని ప్రస్తుతించడం కృతజ్ఞతకు దూరమైన పని! బహుముఖ వైదుష్యం అనే శీర్షికతో ఈ. రా రచించిన నాలుగు పుటల పీఠికలో మాట వరసకైనా కనీస మర్యాదకైనా అవసరాల పేరు దూరకుండా ఎంత జాగ్రర్త వహించాడో చూస్తే ఆశ్చర్యమే కలుగుతుంది.! " Oh west wind, thou

art not so cruel as the man's wickedness!" అని షేక్స్పియర్ మహాకవి వర్ణినే అన్నాడా మరి? అటు అవసరాల కాని, ఇటు ఈ. రా కాని నాకు ఆత్మీయులే! ఐనా నిజం చెప్పవలసివచ్చినప్పుడు మొగం చాటు చేయడం అభ్యుదయ సాహిత్య కులపతి గురజాడకే అపచారం!

1943 నుంచీ అవసరాల అభ్యుదయ కథకునిగా అపార కీర్తిని పొందాడు. అన్నయ్య వెళ్ళిన దారి, ఊరేగింపు, పిచ్చివాడి బొమ్మ వంటివెన్నో గొప్ప కథలు రచించాడు. విశాలాంధ్రలో అసంఖ్యాక సాహిత్య వ్యాసాలు ప్రచురించాడు. పంజరం అనే నాటకం రచించారు. జె.వి. సోమయాజులు రమణమూర్తి సోదరులు ప్రదర్శించగా విపులమైన కీర్తిని పొందారు. ఒకే దీక్షతో నాలుగేళ్ళపాటు గురజాడ సాహిత్యాన్ని పరిశోధించి, ఆ మహనీయుని సాహిత్య గంగాలహరిని తెలుగుప్రజల కందించిన భాగీరథిగా హార్దిక అభినందన లందుకున్నాడు.

కన్యాశుల్కానికి శత జయంతి జరుపుకుంటున్న సందర్భంగా, ఆధునిక సాహిత్యం సాధించిన అమేయ విజయాలను సంస్మరించుకోవడం ఎంత అవసరమో, పొడసూపిన వికార ప్రకరణాలను సమీక్షించుకొని తృణీకరించడమూ అంతే అవసరం!

**(ఆంధ్రప్రదేశ్ 1993 - మే)**

# 5. ఆరంభంలోనే అమేయ జీవన చిత్రాన్ని ఆవిష్కరించిన కన్యాశుల్కం

కన్యాశుల్కం నాటకం ప్రారంభమైన ప్రథమాంకం లోనే మొత్తం ప్రధాన పాత్రల స్వభావ స్వరూపాలు ఆవిష్కృతమయ్యాయి. మొదటి స్థలం- 'విజయనగరంలో బొంకుల దిబ్బ'. ఈ బొంకుల దిబ్బ అనే పేరు ఎలా వచ్చిందో యింతకు ముందే ఎందరో విచికిత్స చేశారు. ఆపేరు ఎలా పరిణామం చెందిందో, ఎలా స్థిరపడిందో అనేది ముఖ్యం కాదు. గిరీశం అక్కడే ఎందుకు ప్రవేశించి, తన తొలి స్వగతం ఎందుకు ఉద్ఘాటన చేశాడు? అనే అంశమే ప్రధానంగా చర్చనీయం. బొంకుల్ అనే పదం డచ్చి భాషా జన్యమని, ఆ ప్రదేశంలో డచ్చివారు మొదట జెయిలు నిర్మించారని వగైరా పూర్వ గాథలతో నాటకానికి ప్రమేయం లేదు.

'బొంకు' అనే మాట తెలుగులో అబద్ధానికీ, దబాయింపుకీ సమానార్థకంగా స్థిరపడి ఉంది. దీనినే మనం పరిగణించాలి. మొత్తం నాటకంలో గిరీశం పాత్ర బొంకులు చెప్పుకుంటూనే బ్రతుకుతుంది. తద్వారానే తన ప్రాగల్భ్యం నిలుపుకుంటుంది. కన్యాశుల్కంలో యితర స్థలాలు, మహారాజావారి కోట, ఘంటస్తంభం, కస్పా, అయ్యకోనేటి గట్టు మున్నగునవెన్నో ప్రసక్తమై వున్నాయి. అవేమీ ప్రథమ గణ్యం కాక- ఒక్క బొంకుల దిబ్బనే మహాకవి స్వీకరించాడంటే భావార్థ సూచకగా వినియోగించుకున్నా డన్న సత్యం ఆలోచిస్తే స్పష్ట పడుతుంది.

కన్యాశుల్కాన్ని కేవలం ఒక నాటకంగా భావించి, కాలక్షేపానికో, సుఖంగా నవ్వుకునేందుకో పఠించే వారికి అంతరార్థాలు సుబోధకం కావు. పదాల నడుమ, కావ్యాల నడుమగల శూన్యావరణలో మహాకవి నిక్షిప్త మొనర్చిన గాఢార్థాలు అందవు. ధ్వనిపూర్వక అన్యాపదేశాలు అవగతం కావు. భావోన్మీలకంగానూ, పరిశలనాత్మకంగానూ అధ్యయనం చేస్తే తప్ప అంతస్సారం స్ఫూరించే అవకాశం లేదు. కన్యాశుల్కం అంతరాత్మ దర్శనం కావాలంటే ఆలోచనాత్మకత అవసరం.

ఇలాంటి అధ్యయనానికి అవకాశం లేని ప్రహసనంగా మిగిలిపోయింది. కనకనే కందుకూరి ప్రథమ నాటకం 'బ్రాహ్మవివాహం' స్థూల దృష్టికే ఆమూలాగ్రం అవగాహనకు అందుతుంది. కన్యాశుల్కం రచనలో గుప్త మొనర్చిన అంతర్గత ఆలోచనా సాంద్రత

భావుకతకు మాత్రమే అందగలదు. అప్పుడే సామాజిక వాస్తవికతలోని రహస్య క్రీనీడలూ దర్శించగలము.

గిరీశం ప్రవేశిస్తూనే బొంకులదిబ్బ పైనించి ప్రకటించిన తొలి స్వగతంతోనే వాడి గతించిన జీవితానికి తెరజార్చింది. వాడన్న 'సాయంకాలమైంది' అనే వాక్యంతో కన్యాశుల్కం నాటకమ్ ప్రారంభమైంది. వాడి విజయనగర వంచనా జీవితానికే సాయంకాలమైంది. అంతేకాదు- స్త్రీ జాతిని బానిసగా మార్చిన పురుషాధిక్య సమాజానికీ సాయంకాలమైంది. ఇన్నాళ్ళుగా పురుషాధిపత్యం నిరాఘాటంగా ప్రచండంగా సాగిపోయింది. అడిగే నాథుడు లేకుండా కొన్ని వేల వత్సరాలుగా ఈ భూమిలో స్థిరపడింది. కడుపున కలిగిన పసికందులనే తల్లితండ్రులు అమ్ముకుంటున్నారు. రూకకు లోనై నెనరూ న్యాయం విడనాడి మార్కెటుకు తోలుతున్నారు. తమ పబ్బం గడుపు కుంటున్నారు. తాము కులుకుతూ, కన్నకూతుళ్ళను వితంతువులుగా మార్చి ఎండు కట్టెలుగా నిలుపుతున్నారు. అలాంటి క్రూర వ్యవస్థ అస్తమించే సమయం ఆసన్నమైంది. సాయంకాలమైంది.

ఇక ఒక్క చీకటి రాత్రి మాత్రమే మిగిలివుంది. అదీ గడిచిపోతే- 'తూర్పు బలబల తెల్లవారుతుంది'. 'సాయంకాలమైంది' అనే వాక్యంతో కన్యాశుల్కం ప్రారంభించిన మహాకవి- 'తన ముత్యాల సరాలను తూర్పు బలబల తెల్లవారెను'తో ఆరంభించారు. ఈ రెండు కాల సూచనల నడుమ, ఆయన సారించిన ఆలోచనా స్రవంతిని మనం భావించగలిగితే- ఒక ఉదాత్త పథకం అవగాహనకందుతుంది. ఒక ప్రణాళికానుసారంగా తన సాహిత్యాన్ని నిర్మించాడనే వెలుగు తేలిగ్గా ప్రసరిస్తుంది.

గిరీశం తన తొలి స్వగతంలోనే- తన ఆగడాలకీ, అసందర్భాలకీ, అసత్య జీవన రీతికీ, ధూర్తత్వానికీ అంత్యకాలం సమీపించిందనీ వాపోతాడు. పూటకూళ్లమ్మ, వీడ్ని నమ్మి మొగదిక్కుగా ఉంచుకుంది. భోజన భాజనాది అవసరాలను తీరుస్తుంది. కాని వాడికా కృతజ్ఞత ఈషన్మాత్రమూలేదు. మానుష భావాలను నిర్జించడమే వాడి వైఖరి. మోసం చేయడమే వాడి ప్రవృత్తి! "పూటకూళ్ళమ్మకు సంతలో సామాను కొనిపెడతానని నెల రోజాల క్రితం ఇరవై రూపాయలు పట్టుకెళ్ళి డాన్సింగ్ గరల్సు కింద ఖర్చు'' పెట్టాడు. దానితో వాడి మొగం చెల్లడం లేదు. ఆవేళ ఉదయమే ఆమె దగ్గరకు వెళ్లాడు. దానికీ వాడికీ పెద్ద యుద్ధమై పోయింది. బుర్ర బద్దలుకొడదామనుకున్నాడు. కాని వాడి మిడి మిడి జ్ఞానం హంతకుని కాకుండా కాపాడింది. "Poor Richard" - ఓరిమి జీవితావసరమని చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది.

1897లో వెలువడిన ప్రథమ ముద్రణ ప్రతిని అతికష్టంపై సంపాదించి, ఆనాడే వెలువడిన విమర్శలన్నిటినీ క్రోడీకరించి ప్రథమంగా ప్రచురించిన కీ॥శే॥ బంగోరే ఈ పూర్ రిచర్డ్ గూర్చిన భోగట్టా అంతా బయటపెట్టే వరకూ ఈ మాట గురించి ఎవరూ

పట్టించుకోనేలేదు. పూర్ రిచర్డు- "షేషెన్సు వల్ల ఎన్నో పనులు సాధించుకోవచ్చు" నని చెప్పిన మాట గిరీశం స్మరించుకున్నాడు. పైగా ఆ 'వెర్రిముండ' నుంచి ఇలాగే డబ్బు ఎన్నో మార్లు లాగేస్తూనే ఉన్నాడు. ఆమె పోనీలే వెధవ అని ఊరుకుంటూనే ఉంది. కాని ఆమె- వీడు డాన్సింగ్ గరల్సుతో దుష్ట తిరుగుళ్ళు తిరుగుతున్నట్లు ఆచూకీ పట్టేసినట్లుంది. "ఓర్వలేని వెధవ యెవడో చెప్పివుంటాడు!" అని తన తప్పు ఇతరులపై తోసేస్తాడు. ధూర్తులు విమర్శ చేసుకోరు. ప్రవర్తన దిద్దుకోరు! అదే స్వభావాన్ని గిరీశం ఆదిలోనే ఆవిష్కరించుకున్నాడు.

ఉదయం జరిగిన ఉదంతం/వల్ల తేలేదేమంటే యిక ముందు తనకు "తిండి పెట్టేట్టు కానరాదు", "ఈ ఊళ్ళో మరి మన పప్పు ఉడకదు! ఎటు చూసినా అందరికీ బాకీలే! వెంకుపంతులుగారి కోడలికి లవ్‌లెటర్ రాసినందుకు ఎప్పుడో ఒకప్పుడు సమయం కనిపెట్టి దేహశుద్ధి చేస్తాడు. శీఘ్రంగా ఇక్కణ్ణించి బిచాణా ఎత్తి వేయడమే బుద్ధి లక్షణం!" అని గిరీశం నిశ్చయించుకున్నాడు.

ఈ నిర్ణయం వెనుక వాడి దగుల్బాజీ ప్రవర్తన విస్పష్టమే. విజయనగరంలో అప్పటి వరకూ గడిపిన రోజుల భోగట్టా య్యావత్తూ ఈ వాక్యాల ద్వారా నివృతమైంది. కానీ వెంకుపంతులుగారి కోడలికి లవ్‌లెటర్ రాసిన ఫలితం మాత్రం నాటకంలో ఎక్కడా మళ్ళీ ప్రసక్తి రాదు. వాడు భయపడినట్లు దేహశుద్ధి జరిగితే ఆత్మశుద్ధి కూడా జరిగి కథే మలుపు తిరిగి పోయేది. బహుశా ఆ లవ్‌లెటర్ గురించి పాపం ఆ కోడలే గొడవ చేసుకోకుండా అణిచేసుకుని వుంటుంది. లేకపోతే తన బ్రతుకే అపహాస్యమై పోతుందవి భయపడి వుంటుంది. మరి కొన్నాళ్ళు గిరీశం విజయనగరంలోనే గడిపివుంటే ఏమయ్యేదో!

'శీఘ్రమేవ పలాయనం' అనే సూత్రం తనకెరికే కాని- 'మధురవాణిని వదలడమంటే యేమీ మనస్కరించకుండా ఉంది". అని మనస్సులోని దుఃఖాన్ని బయట పెట్టు కుంటూనే- మొత్తం స్త్రీజాతి మీదనే ఒక అభాండం దొర్లిస్తాడు.

'It is women that seduces all mankind" అని ఎవడో ఒక ఆస్కార్ వైల్డ్ వంటి భ్రష్టుడు విసరవలసిన Platitude కనుక గిరీశం పాత్రకు నప్పింది. కాని మధురవాణి వంటి సహృదయ, సద్గుణశీలి అయిన వేశ్యను సెడ్యూస్ చేసిన, చీట్ చేసిన, పుండాకోరుతానే! ఆ సంగతి తనకు తెలుసు "నేను యేమో ఉద్యోగాలు, ఊళ్ళు యేలి తనతో వైభవం వెలిగిస్తానని నమ్మకంతో ఉంది, పూర్‌క్రీచర్! అని తానే ఒప్పుకున్నాడు. ఇక్కడ పూర్‌క్రీచర్ లోని పూర్ విశేషణమైతే పూర్ రిచర్డ్‌లోని పూర్ పదం పేరుకు సంబంధించింది. ఈ రెండు పదాలకీ ఒకే అర్థంగా తప్పుదారి పట్ట కుండానే గురజాడ ఒకే సందర్భంలో ప్రయోగించాడు.

దూరంలో వస్తున్న వెంకటేశం కనిపించాడు- క్రిస్టమస్ సెలవులు యిచ్చివుంటారు. కనుక వాడితో, చదువు చెప్పే మిషతో వాడి వూరికి ఉడాయిస్తే చాలా చిక్కులు వదుల్తాయి- అనే ఆలోచన మెరుస్తుంది. గిరీశం భ్రష్టుడే కాని ప్రతిభావంతుడు, ఆలోచనలు దూయగలడు, మాటకారి తనంతో ఎవడినైనా బుంగలో పెట్టేయగలడు. పరిమిత జ్ఞానమే అయినా బుద్ధి కుశలత వల్ల, చాక చక్యం వల్ల ప్రతి సన్ని వేశాన్నీ స్వార్థానికి వినియోగించుకోగలడు. ఎవడినైనా అవలీలగా మోసం చేయగలడు.

వేంకటేశ్వర్లు మొగం చూస్తూనే పరీక్ష పోయిందని గ్రహించి, గిరీశం ఒకటస్సా వేశాడు. షేక్స్పియర్ అని సంబోధించడం ద్వారా ఉబ్బేస్తాడు. వెంటనే వాడు "ఇక మీర్నాతో మాట్లాడకండి; మాష్టారు మీతో మాట్లాడొద్దన్నారు. మీ సావాసం చేయడం చేత నా పరీక్ష పోయిందని అన్నారు" అంటూ మనసులోని మాటను అమాయకంగా బయట పెడతాడు. దాన్ని తిరగేసి సిద్ధాంతం చేస్తాడు గిరీశం. తాను మొదటనుంచీ అనుమానిస్తూనే ఉన్నాడట. ఆ మాస్టర్ గాడికి తనంటే గిట్టదట. అందుకే వెంకటేశాన్ని ఫెయిల్ చేసాడట. లేకుంటే షేక్స్పియర్ అంత తెలివైనవాడు ఫెయిలవడమేమిటీ? ఆ మాస్టారు తప్పుల తడక చెబుతూంటే తాను ఖండించబట్టే తనపై వాడికి పగ. "న్యూస్ పేపర్లో యేకేశాను" అంటూ మరో గట్టికోత! వెర్రి వెంకటేశం డంగైపోయాడు! ఏమవుతాడు? అంతకన్నా నిభాయించుకొని కదలగల సత్తా ఎక్కడిది?

కబుర్లతో కాలక్షేపం చేసే సాహసంలో వెంకటేశం వంటి కుర్రాడు చుట్టలు కాల్చడం నేర్చుకున్నాడే తప్ప, ఒక్క అక్షరం నేర్చుకోలేదు. ఐనా గిరీశం మాటల్లో పడిపోయాడు. కోపం నటించాడు. పౌరుషం అభినయించాడు. పైగా తన మహోదాత్త వ్యక్తిత్వం గురించి ఇలా ఉద్ఘాటించాడు. "ఇది బేస్ ఇన్ గ్రాటిట్యూడ్! నాతో మాట్లాడ్డమే ఒక ఎడ్యుకేషన్ ఆ మాట కొస్తే నీకున్న లాంగ్వేజి మీ మాస్టరుకుందీ? విడో మ్యారేజ్ విషయమై, నాచే కొశ్చన్ విషయమై నీకెన్ని లెక్చర్లిచ్చాను?" అని డబాయిస్తాడు. సెకండ్ ఫాం చదువుతున్న గుంట వెధవకి ఆ లెక్చర్లు ఎందుకు ఉపయోగిస్తాయన్న ప్రశ్న వెంకటేశానికి కలగనివ్వడు గిరీశం. మహాకవి స్వయంగా ముందు మాటలో చెప్పిన సూక్తికి వెంకటేశం పాత్ర- " the bliss of ignorance could not have been more forcibly illustrated" దాఖలాగా నిలుస్తుంది. గిరీశం యింకా స్వోత్కర్ష చేసుకుంటూ తన దగ్గర చదువుకున్న వాడెవడూ అప్రయోజకుడు కాలేదంటూ, మేరు పర్వతమంత డంబాచారాలింకా పలుకుతాడు. ఆలోచనా పరులకామాట ఎంత ఉత్సేకం కలిగించిందో మరో వ్యాసంలో పరిశీలిద్దాం!

**(విశాలాంధ్ర 21-1-1993)**

# ౬. జీవన క్లేశాన్ని సామాజిక హాసంగా ప్రదర్శించిన కన్యాశుల్కం

స్త్రీ పురుషుల మధ్య సమానత్వం లేకుండా మానవత్వం ప్రవర్ధిల్లదు. అధర్వణ వేదకాలం నుంచీ మనదేశంలో స్త్రీ బానిసగా మార్చబడింది. తదుపరి యుగాలలో బానిస- బానిస సంతతులనే ఉత్పత్తి చేస్తోంది. ఐనా పురుషుడు తాను బానిసనని గుర్తించలేదు. తల్లిని, చెల్లిని, ఇల్లాలినీ బానిసలుగా తలాయిస్తున్నాడు. స్త్రీ పురుషుల అసమానత్వం నుంచే ఎన్ని అరిష్టాలైనా పట్టుకున్నాయిమన జాతికి. సహగమనమో, కన్యాశుల్కమో, వరవిక్రయమో, ఏదైనా చివరికి స్త్రీనే చితికెక్కిస్తోంది. అందుకే శ్రీ.శ్రీ కన్యాశుల్కం నాటకాన్ని "బీభత్సరస ప్రధాన విషాదాంతం"గా అభివర్ణించాడు.

కన్యాశుల్కం గురించి ఎంతైనా రాసుకు పోవచ్చు. ఎందరు రాసినా రాయవలసిన విషయాలు ఇంకా మిగిలిపోతూనే ఉన్నాయి. అదేదాని అజరామరత్వానికి గీటురాయి. "కన్యాశుల్కం ఒక మహాసముద్రం. జీవితమంత విశాలమైనదీ, అగాధమైందీ!" అన్న శ్రీ.శ్రీ మాట త్రికాలాబాధిత సత్యం! "మన వాళ్ళు ఉత్త వె॰ వాయలోయ్" అని గిరీశం చేత పలికించిన మాట పరాచికం కాదు. మనవాళ్ళ సంగతిలాంటిదే కనుక కన్యాశుల్కం పుట్టి నూరేళ్ళు పైబడ్డా కొంతమందే దాన్ని పట్టించుకుంటున్నాం. ఇది ఒక జాతీయ మహోత్సవంగా జరగవలసింది! ఆ మహానాటకం పేరైనా వినని 'వెధవాయలు' ఇంకా ఎందరున్నారో లెక్కలు తీయించడానికి అలనాటి ఆనందగజపతి దిగి రావాలి. ఆ సత్తా మన పాలకుల కెక్కడుంది? తలచెడి, ఇంటపష్ట వెధవాడపడుచుల కంటే హీనమైన గంగా భాగీరథీ సమానులే కదా ఎక్కువమంది!

కన్యాశుల్కం పేరెత్తితేనే అగ్నిహోత్రావధానుల్లా ఒకనాడు విరుచుకు పడేవాడునా మిత్రుడు కేతవరపు వెంకటరామకోటి శాస్త్రి! రెండు దశాబ్దాలైనా గడవకముందే చెంపలు వాయించుకున్నాడు. గురజాడ పాదముల ముందు సాష్టాంగ దండ ప్రమాణ మాచరించాడు. మన పాఠకులలో ఇలా చిత్త పరిణామాన్ని ప్రకటించగల నిజాయితీపరులు మాత్రం ఎంతమంది?

కన్యాశుల్కం గురించి ఏవో చిల్లర బెంగలు పెట్టుకున్న 'మేధావులు' అసలు విడిచి కొసరు లంకించుకుంటారు. ఏవేవో హైపోథీసీస్సులు క్రుమ్మరిస్తుంటారు. తద్వారా వినూత్నమైన తమ తెలివి ప్రదర్శిస్తూనే ఉంటారు. గిరీశం భ్రష్టుడు, కితవుడు, దగుల్బాజీ!

అవునా? అలాంటివాడితో బుచ్చెమ్మకు పెళ్ళి చేయలేదని గురజాడ వారిపై మండిపడ్డారు. బుచ్చెమ్మ అమాయకత్వంపై మోజుపడి విష్‌ఫుల్ థింకింగ్ వల్ల కాబోలు పాపం!

చాలా రోజులక్రితం సంగతి. నా మాన్యమిత్రులు కీ॥శే॥ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తి- "బాలికల్ని వృద్ధుల కీయకుండా చేద్దామని గురజాడ వారు పూర్ణమ్మ పాట రాశారు" అన్నారు. అదేనా దాని ప్రయోజనం? ఆ మహత్తర కవిత ద్వారా మహాకవి ధరఖాస్తు విన్నపములా చేసింది? అది కావ్యమైనప్పుడు దానికి గల బహుముఖ కాంతి పుంజాన్ని గుర్తించి వ్యాఖ్యానించనక్కర లేదా? ఇంత ఓవర్ సింప్లిఫికేషన్‌తో ఆ కావ్యం అంతస్తత్వాన్ని దెబ్బతీయడం కాదా?

సామాజిక వాస్తవికతను, అందలి క్లిష్ట సమస్యలను బహుకోణాలుగా ప్రదర్శించడమే కన్యాశుల్కంలో గొప్ప ఆర్టిస్టుగా గురజాడ బాధ్యత! ఉన్న జటిల సమస్యలన్నిటికీ సాహిత్యంలో పరిష్కారం చూపించేసి తమదారిని తాము పోయేవారి గ్రంథాలూ, వాటి దారిని అవీ పోతాయి!

సాహిత్యంలో పరిష్కారమైనంత మాత్రంలో సంఘంలోని సమస్యలు పరిష్కారమై పోతాయనుకోవడం వెర్రిబాగులతనం. వీరేశలింగం గారు 1919లో చనిపోకముందే ఆయన రచించిన ప్రహసనాలన్నీ ప్రజా జీవనం నుంచి తప్పుకున్నాయి. అలా ఎందుకు జరిగింది? ఆయన రచించిన తొలి ప్రహసనం హితకారిణిలో ధారావాహికంగా ప్రచురించ బడుతున్నప్పుడు (బ్రాహ్మ వివాహం 1978) గురజాడ పదహారేళ్ళ యువకుడు. కుశాగ్ర బుద్ధితో చదువుకుంటున్నాడు.

ఆ ప్రహసనం పెద్దయ్యగారి పెళ్ళిగా ప్రజలలో పేరుపొందింది. 'అందులో కొరవడిన రక్తి ఏది? దానిని ఎలా భర్తీ చేయాలి? సజీవ నాటకం ఎలా రచించాలి?' అని అప్పటి నుంచే మథనపడుతున్నాడు గురజాడ.

యుగపురుషుడైన వీరేశలింగం సమస్త రచనలలోనూ, చాలినంత శిల్ప సంపదను ఆయత్తం చేయగల తీరిక ఉన్నవాడు కాదు. ఆయనకెన్నో బాధ్యతలు. మూఢాచారాల బ్రహ్మాజెముడు డొంకల్ని నరుక్కుంటూ వేగంగా సమాజాన్ని వాస యోగ్యమొనరించిన వీరసైనికుడు. అందుకే ఆ శిల్ప సంపదను సాధించు కోవలసిన మహత్తర బాధ్యతను తన నెత్తికెత్తుకున్నాడు గురజాడ.

ఆయన మహా పండితుడేం కాదు. కాని చిన్నయసూరిని చంపి పుట్టినవాడు. (చిన్నయ సూరి మరణం 1861 లోనే) మహాద్రష్ట షేక్స్పియర్ లాగే మానవ స్వభావాన్ని తరచి తరచి చూడగలిగాడు. ఆయన అలాంటి నిశిత విద్యావంతుడు, వివేకశీలి

'కారుణ్యం అనే వెలుతురు ప్రసరించి చూస్తే సృష్టిలో అందం లేని మనిషేలేడు. ద్వేషంతో చూస్తే అంతా ఏకనలుపే!' అనగలిగినంత నిశితదృక్కు గురజాడది.

సుగుణాత్మక పాత్రలకు మంచి పేరులూ, దుర్గుణాత్మక పాత్రలకు దుష్టనామాలు పెట్టడం పురాణ పద్ధతి. జయేతి హాసంలో సుయోధనుడు దుర్యోధనుడై పోయాడు. పాండవాగ్రజుడు ధర్మరాజుగా పేర్కొన బడ్డాడు. భాగవత కథలలో ప్రహ్లాదుడు, అక్రూరుడు, మంచి పేరు గల మంచివాళ్ళు. పేదరికానికి ప్రతీక కుచేలుడు. రామాయణంలో రామశబ్దం సౌందర్యానికీ, సౌశీల్యానికీ ప్రతీక. రావణ పాత్ర సర్వ జనులనూ పీడించి ఏడిపించే వాడని అర్థం. ఇక శూర్పణఖ, కుంభకర్ణ, మారీచ వంటి పేర్లు! గ్రీకు పురాణాల్లోనూ ఆ సంప్రదాయం ఉంది. షేక్స్పియర్‌కు పూర్వం ఆంగ్ల నాటకాలలోని పాత్రల పేర్లు మిస్టర్ ఈజెల్, మిస్టర్ జెలసీ వంటివే వుండేవి. షేక్స్పియర్ మాత్రం సాధారణ నామాలతో వ్యక్తుల శీల పరిశీలనకు శాశ్వత స్థానం కల్పించాడు. హేమ్లెట్ పాత్ర ఇప్పటికీ సంశయ వాదులకు ప్రతీకే! భార్యను నిత్యం అనుమనించే భర్తలకు ఒథెల్లో ప్రతినిధే!

యుగ పురుషుడు వీరేశలింగం సైతం తన ప్రహసనాలలో అజ్ఞానమ్మ, ధనాలకామయ్య, బట్టతల అలివేణి సొట్టకాలి హంసగమన వంటి పేర్లే పెట్టాడు. ఆ ప్రభావమే గురజాడ పైనా కొంత ప్రసరించింది. ఛాందస బ్రాహ్మణ్ణి అగ్ని హోత్రావధానులనీ, ముదిమిలో పెళ్ళికి సిద్దపడుతూ రూపాయల కోసం గుండెలు భాదుకునే పిసినిగొట్టుకు లుబ్ధావధానులనీ, గుణశీల వైఖరులకు సౌజన్యరావు అనీ పేర్లు పెట్టాడు. కాని వీరేశలింగం గారికి అందని ఆధునిక నాటక శిల్ప రహస్యం గురజాడ సాధించాడు. రామప్పంతులు, గిరీశం వంటి సామాన్యమైన పేర్లు పెట్టాడు. ఏ గుణాలనూ స్వయం వ్యక్తం చేసేవి కావు.

వీరేశలింగం ప్రహసనాలు ఒక్కసారైనా చదవని వారికి ఆయన కల్పించిన పాత్రల సంభాషణలన్నీ శుద్ధ వ్యావహారికంలోనే సాగాయన్న సత్యం తెలియదు. పాత్రోచిత భాష సైతం ఆయనే ప్రయోగించాడు.

కన్యాశుల్కం వ్యావహారికంలో రాసినందువల్లగానీ, విజయనగర మాండలికాన్ని ఉపయోగించడం వల్ల గానీ అజరామరత్వం సాధించినదనడం ఓవర్ సింప్లిఫికేషన్!

కన్యశుల్కమంతటా సజీవమైన సమాజ వాస్తవిక తను ఆవిష్కరించే శిల్ప సంపదనే మనం పరిగణించాలి, విశ్లేషించాలి. దాన్ని విడిచి చాలామంది విమర్శకులు ఉపరితల స్పర్శ చేయడమే కనిపిస్తుంది. వీరేశలింగం వ్యావహారిక భాషలో ప్రహసనాలు రచించిన తర్వాతనే ఒక సంపూర్ణ నాటకం వ్యావహారిక భాషలో రాయడమెలాగన్న విచికిత్సకు గురజాడ లోనయ్యాడు. సనాతన సంప్రదాయవాది వేదం వెంకటరాయ శాస్త్రి, సైతం

తన మహానాటకం ప్రతాపరుద్రీయంలో "నీచ పాత్రలకు" "నీచగ్రామ్యం" ప్రయుక్తం చేశాడు. తాను రాయబోయే మహానటకాన్ని ఏ భాషలో రచించాలి? తనది ప్రజల ఉద్యమమని విశ్వసించినవాడు! వెంటనే కలకత్తా వెళ్ళి రవీంద్రునితో చర్చించాడు. ఆయన వ్యావహారిక భాషలోనే రచనలు వంగ భాషలో చేస్తున్నట్లు చెప్పాడు.

గురజాడ సంతృప్తుడయ్యాడు. మహారాష్ట్రలో సాంఘిక నాటకాలు ఎలా రచించ బడుతున్నవో సమీక్షించాడు. తన నాటకానికి ప్రణాళిక సంసింద్ధం చేసుకున్నాడు. అది పాత్రోచిత భాషా విరహితమైతే కళ కట్టదు. పూరాగా ఒక సంవత్సరం పాటు ఆలోచించి ప్రణాళిక సంసిద్ధపరచుకున్నాడు.

పంచతంత్ర, రాజశేఖర చరిత్ర మున్నగు సకల రచనలూ వీరేశలింగం సరళ గ్రాధికంలోనే రచించినా ప్రహసనాలు మాత్రం వాడుక భాషలోనే రచించాడు. దానికి కారణం స్వీయచరిత్రలో వివరించాడు. కన్యాశుల్కం తొలి రూపం రచిస్తున్న సమయానికి గిడుగు రామ్మూర్తి గారు వ్యావహారిక భాషావాదం ప్రారంభించలేదు. సవరభాష లిపి సమకూర్చడంలోనూ, ప్రాథమిక విద్యా ప్రణాళికలు రూపొందించడంలోనూ నిమగ్నమై ఉన్నారు. ఆ విషయాలన్నీ సీతాపతి గారు రచించిన వారి జీవిత చరిత్రలో వివరించబడ్డాయి. కన్యాశుల్కం ప్రథమ దర్శనం 1892 ఆగష్టు 13వ తేదీని జరిగిన తర్వాత ఆ ప్రదర్శనానుభవంతో గురజాడ కొన్ని మార్పులు చేశారు.

1897లో ప్రథమ ముద్రణ ప్రచురించాడు. ఆ గ్రంథంకోసం పనికట్టుకొని పర్లాకిమిడి నుంచి వచ్చిన గిడుగు వ్యావహారిక భాషా యోగ్యతకు ఆమోదించారు. ఉద్యమాన్ని ప్రారంభించారు. ఈ క్రమాన్ని సాధారణంగా విమర్శకులు గమనించడంలేదు.

1892లోనే జార్జిబెర్నార్డ్‌షా విడోయర్స్ హౌసెస్ అనే నాటకం రచించి ప్రదర్శనలు జరిపించాడని విలియం ఆర్చర్ వివరించాడు. ఆర్చర్ బెర్నార్డ్‌షా వలెనే 1856లో జన్మించి, లండన్‌లో ఇండిపెండెంటు థియేటర్‌నూ, ది వరల్డ్ అనే పత్రికనూ నిర్వహించేవాడు. ఆ నాటకం 1893లో మాత్రమే ప్రచురించబడింది. గురజాడ కన్యాశుల్క రచనకు ఐదేళ్ళుముందే ఇబ్సన్ నాటకాలను ఆర్చర్ అనువదించి ప్రచురించాడు. ఆంగ్ల సాహిత్యాధ్యయనంలో గురజాడ అపార కృషి సలిపినవాడు. కాని ఇబ్సన్ నాటకాలు గానీ, బెర్నార్డ్‌షా నాటకాలుగాని చదివినట్లు తన డెయిరీలలో రికార్డు చేయలేదు. ఈ చర్చ వల్ల ధ్రువ పడేదేమంటే గురజాడ ఒక సంపూర్ణ మౌలిక రచనగా కన్యాశుల్కాన్ని రూపొందించడంలో ఎంత మహత్తర ప్రతిభను ప్రదర్శించాడో ఆలోచించాలనే!

వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమం తీవ్రంగా సాగిస్తున్న తొలిరోజుల నుంచీ, కుహానా సంస్కర్తలు కుటిలిరూ. ఆ ఉద్యమంలో ప్రవేశించి కుక్షింభరులుగా బ్రతుకుతూనే

ఉన్నారు. ఒక దశలో దొంగ సంస్కర్తల సంఖ్యే అధికమైంది. అందుకే గిరీశాన్ని వంచక సంస్కర్తగా చిత్రించి ప్రాయశ్చిత్తం జరిపించి బుచ్చెమ్మల్లాంటి వెర్రి తెంపర్లాటతో రాజమండ్రికి ప్రయాణం కట్టే అమాయక బాల వితంతువులను రక్షించాడు. గురజాడ హృదయాన్నే సౌజన్యరావు ఆవిష్కరించాడు. సమాజంలో నిర్భీతిగా సంచరిస్తున్న మృషా సంస్కర్తల నిజరూపాన్ని ఈ మహానాటకం ద్వారా ఎండగట్టాడు.

దీని వల్ల సంఘ సంస్కరణోద్యమానికి భద్రత చేకూరింది. 1892నాటికి సంఘ సంస్కరణోద్యమం సంపూర్ణ విజయం సాధించలేదు ప్రతీప పవవనాల కెదురొడ్డి నిలబడవలసే వస్తోంది. ఈ ట్రాన్సిటరీ పీరియడ్‌లో సెర్చిలైటుగా కన్యాశుల్కం అందింది. ఆ మహోద్యమాన్ని వేగవంతం చేసింది. .......

**(29-11-1992 విశాలాంధ్ర)**

# 7. గిరీశం ఉల్లేఖించిన పూర్ రిచర్డ్

కన్యాశుల్కం ప్రథమాంకంలో గిరీశం బొంకులదిబ్బ వద్ద చెప్పుకున్న ప్రథమ స్వగతం లోనే- ఆవేళ ఉదయం పూటకూళ్ళమ్మకీ, తనకీ యుద్ధమైపోయిందనీ, బుర్రబద్దలు కొడదామా అన్నంత కోపం వచ్చిందనీ, కానీ "పూర్ రిచ్చర్డ్" చెప్పినట్లు పేషెన్సు ఉంటేకాని లోకంలో పని జరగదు" అని నిశ్చయించుకున్నట్లూ ఉద్ఘాటిస్తాడు.

పైన ఉటంకించిన మాటలు ఆ మహానాటక ప్రథమ ముద్రణ (1897) లోనివి. బహుప్రయాసకు లోనై సొంత వ్యయంతో మిత్రుడు కీ॥శే॥ బం.గో.రె. 1969లో దానికి ద్వితీయ ముద్రణ ప్రచురించాడు. గొప్ప పీఠికలూ అధో జ్ఞాపికలూ ఎన్నో వివరణలూ సమకూర్చాడు. ఈ పూర్ రిచ్చర్డ్ విషయంలో అధోజ్ఞాపికలో- "ఈ మాట అన్నది ఏ రిచ్చర్డో పరిశోధించవలసి వున్నది. బహుశా షేక్స్పియర్ రెండో రిచర్డా? లేక ఇది గిరీశం గారి వొట్టి బుకాయింపేనా?" అని ఊరుకున్నాడు. గ్రంథాంత వివరణల అనుబంధంలో మరింకేమీ ప్రస్తావించలేదు. ఎన్నిటికో ఎంతో శ్రమతో వివరణలూ, వ్యాఖ్యానాలు యిచ్చిన బంగోరె ఈ పూర్ రిచ్చర్డ్ పుట్టు పూర్వోత్తరాలు ఉపేక్షించాడు. అది గిరీశం డబాయింపుగా భావించడం వల్లనే ఉదాసీనత కలిగి ఉంటుంది.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారి ప్రచురణ సంఖ్య 1461తో 1986సెప్టెంబరులోనూ 1990 జూలై లోనూ వచ్చిన రెండు ముద్రణలకూ సంపాదకుడుగా శ్రీ సెట్టి ఈశ్వరరావు వ్యవహరించారు. 'కన్యాశుల్కం ఒక అపూర్వ సృష్టి' అనే శీర్షికతో ఒక అపూర్వ సంపాదకీయం (39 పుటలు) సంతరించారు. ఎంతో ఉత్తమ సమాచారం అందించారు. కానీ పూర్ రిచ్చర్డ్ గురించి స్పర్శించలేదు.

అలాగే ఇంతకు పూర్వం వచ్చిన యితర ప్రచురణ సంస్థలవారి ప్రతులలోనూ దీని స్పర్శ లేనేలేదు.

ప్రథమ ద్వితీయ ముద్రణలలో సైతం పూర్ రిచ్చర్డ్ ఉల్లేఖనంలో ఏ మార్పూ చేయలేదు. అంటే ఈ ఉల్లేఖనం గిరీశానికి ఎంత అవసరమో మహాకవి తీవ్రంగానే భావనచేసి నిశ్చయం చేశారన్నమాట.

ఇదొక ఆషామాషీ డబాయింపుగా బం.గో.రె సందేహించి ఉదాసీనత వహించడంలో న్యాయంలేదు. కన్యాశుల్కం పై ఎంతో పరిశోధించి సాధికార విమర్శలు రచించిన

సర్వశ్రీ ఆరుద్ర, కె.వి. రమణారెడ్డి, సర్దేశాయి తిరుమలరావు, ఈశ్వరరావు ప్రభృతులు పూర్ రిచ్చర్డ్ గురించి ఆలోచించక పోవడమూ సబబుకాదు.

శ్రీ సర్దేశాయి తిరుమలరావు 'కన్యశుల్కం-నాటకకళ' అనే మహత్తర విమర్శ గ్రంథాన్ని 1974లో కేవలం ఐదువందల ప్రతులు మాత్రమే ప్రచురించడం వల్ల ఆ గ్రంథానికి రావలసిన ప్రశస్తి కలగలేదు. దాని ద్వితీయ ముద్రణను విశాలాంధ్ర ప్రకాశన సంస్థవారు స్వీకరించడం ఎంతో అవసరం. వీరు కన్యాశుల్కం గురించిన పూర్వోత్తర మీమాంసలను లోతుగా పరిశీలించారు. వారి గ్రంథంలో అనన్య సామాన్యమైన ధిషణ ప్రదర్శించారు. ఉదాత్త ప్రామాణికతను సాధించారు. కానీ ఇంత గొప్ప విమర్శ గ్రంథంలో సైతం పూర్‌రిచర్డ్ గురించిన ప్రస్తావనే లేకపోయింది.

అంటే ఇప్పటివరకూ పైన పేర్కొన్న పరిశోధకులంతా ఈ మాటను చాలా అల్ప విషయంగా భావించి వుంటారు. ఈ పూర్‌రిచర్డ్ ఒక వ్యక్తి పూర్తి పేరుగా కాక- ఎవరో 'పూర్ ఫెలో'గా భావించి తూష్ణీకారం ప్రదర్శించి వుంటారు. ఈ రిచర్డ్ పేరు ముందుగల పూర్ విశేషణం గాని, దయా ప్రదర్శనంగాని కాదని అది అతని పేరులో భాగమని నాకు అనుమానం కలిగి పరిశోధించగా ఇన్నాళ్ళకి నాకు భోగట్టా లభించింది.

ఎప్పుడో 1880లో ప్రచురితమైన 'జార్జి రోటలెడ్జి అండ్ సన్సు' వారి పద్యగద్య సాహిత్య సంకలనం నా దగ్గర చిరకాలంగా వుంది. అది ఎప్పుడో మా తండ్రిగారు సంపాదించినది. దానిని చాలామారులు తిరగవేసినా శ్రద్ధగా మరోమారు చదవాలన్న సంకల్పంతో యిటీవల మళ్ళీ చదవనారంభించాను. షేక్స్పియర్ నుంచి ప్రారంభమైన ఆ గ్రంథం 185 పుటలో బెంజిమన్ ఫ్రాంక్లిన్ (1706-90) అనే శీర్షిక క్రింద యిచ్చినది చదువుతూండగా పూర్ రిచ్చర్డ్ సూక్తులుగా ఐదారు ఉండటం గమనించేసరికి కుతూహలం పెరిగింది. ఇంతవరకూ అందరూ ఉపేక్షించిన పూర్ రిచ్చర్డ్ లభించిన ఆనందమూ కలిగింది. మిగిలిన భోగట్టా తెలుసుకునేందుకు అన్వేషణ ప్రారంభించాను. నా మిత్రులు, సాహిత్యాభిలాషి నిరంతర గ్రంథ పాఠకులు డా॥ కె. వెంకట్రావుగారితో బెంజిమన్ ఫ్రాంక్లిన్ గురించి ప్రస్తావించాను. ఆయన వెంటనే రీడర్స్ డైజెస్ట్‌లోనో ఎక్కడో బెంజిమన్ ఫ్రాంక్లిన్ గురించి ఒక గొప్ప వ్యాసం చదివానంటూ ఈ క్రింది విషయాలు వివరించారు. "ఆయన గొప్ప రాజకీయ వేత్త, స్టేట్స్‌మేన్, అమెరికన్ ప్రెసిడెంట్ కావలసినవాడు, అభ్యర్థిగా ఒక వోటు తేడాతో ఓడిపోయాడు.

సైంటిస్టు- మేఘాలలో విద్యుత్తు ఉంటుందనీ, భిన్న ధ్రువాలు కలుసుకున్నప్పుడు పుట్టే మంటలే మెరుపులనీ, శబ్దాలే ఉరుములనీ మొట్టమొదట కనిపెట్టినదాయనే అని, కవీ, రచయిత అనీ, అమెరికా రాయబారిగా ఫ్రాన్స్‌లో పనిచేశాడనీ చాలా వివరాలందించారు.

బెంజిమన్ గురించి సమగ్ర సమాచారం తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది. మా గ్రంథాలయానికి పోయి ఎన్సైక్లోపీడియా బ్రిటానికా 'ఎఫ్' విభాగం తీసుకుని పరిశీలించాను. 711పుట రెండో కాలం మొదట 719పుట మొదటికాలం వరకూ సుదీర్ఘ వివరాలివ్వబడ్డాయి. ఆయన 1732లో ప్రారంభించిప్రతి సంవత్సరం 'పూర్‌రిచర్డ్స్ ఆల్మనాక్' అనే సంపుటిని ఐదు సంవత్సరాలుపాటు ప్రచురించేవాడట. పదివేల ప్రతులకు తక్కువగాకుండా అమ్మకాలయేవనీ, ఆ ఆల్మనాక్ చదువుకున్న వారందరికీ గొప్ప గ్రంథంగా ఎన్నో శాస్త్రీయ, జీవిత సత్యాలు ప్రబోధించేదనీ, ఎన్సైక్లోపీడియా వివరించింది. ఫ్రాంక్లిన్ తన ఎనభై ఐదోఏట 1790లో ఏప్రిల్ 17తేదీన మరణించాడనీ, పూర్‌రిచ్చర్డ్ ఒక కల్పిత పాత్రగా కాక ఒక మహావ్యక్తి యథార్ధ నామంగానే ప్రజలు పరిగణించేవారనీ వివరించింది.

నాకోసం శ్రమ తీసుకుని నా మిత్రులు గ్రంథాలయాధ్యక్షులు శ్రీ చెలికాని భావనారావు అన్వేషించి ఆటో బయాగ్రఫీ ఆఫ్ బెంజిమన్ ఫ్రాంక్లిన్ అనే గొప్ప గ్రంథాన్ని సంపాదించి పంపారు. నిదాఘతప్త దీన పాంథునికి చలివేంద్ర ఎదురైనంత ఆనందం కలిగింది. ఆత్రంగా చదవనారంభించాను. ఫ్రాంక్లిన్ అసాధారణ మేధావి అద్భుతమైన జ్ఞాపకశక్తితో చివరి రోజుల్లో స్వీయ చరిత్ర రచించారు. అసాధారణ నిజాయితీతో అంత ప్రతిష్టాకరం కాని విషయాలను సైతం వెల్లడించుకుందుకు వెనుకంజ వేయలేదు.

ఆ గ్రంథం అక్షరాక్షరం నన్ను బంధించి లాక్కుపోయింది. 1732నుంచి తను సాధించిన విజయాలు గురించి ప్రస్తావిస్తూ బెంజిమన్ ఫ్రాంక్లిన్ 197పుట నుంచి పూర్‌రిచ్చర్డ్ సూక్తులు అనే ప్రకరణం పొందుపరచాడు. పూర్‌రిచ్చర్డ్ ఆల్మనాక్‌లో ప్రతి సంవత్సరం- ప్రపంచంలోని అన్ని దేశాల విజ్ఞానుల నుంచి సూక్తులు సేకరించి తన భాషలో పొందుపరిచేవాడిననీ, వాటిని పూర్‌రిచ్చర్డ్ అనే మేధావి స్వీయ సూక్తులుగానే ప్రజలు స్వీకరించి ఆదరించేవారనీ కొన్ని అనుభవాలు వర్ణించాడు. ఉదాహరణ మాత్రంగా తన స్వీయ చరిత్రలో 111 సూక్తులు మాత్రమే ఉల్లేఖించాడు.

ఈ నూట పదకొండు ఏరిన ముత్యాలలోనూ గిరీశం ఉల్లేఖించిన సూక్తి మూల మిదిః " He that can have patience can have what he will" అనే దాని అనువాద రూపంగానే మహాకవి గిరీశం నోట పలికించారు. పూటకూళ్ళమ్మ బుర్రబద్దలు కొట్టకుండా గిరీశాన్ని రక్షించిన సూక్తిగా ఆ మహానాటక ఆరంభంలోనే మణి దీపంలా మెరిసింది. అంతేకాదు, ఆ మహానాటకంలో గిరీశం పాత్ర ప్రవర్తన నిరుద్రేకంగానూ, అనేక సంక్లిష్ట పరిస్థితుల్లో సైతం ఓరిమితో వ్యవహరించి నెగ్గుకు ర్వావడంలోనూ యీ పూర్‌రిచ్చర్డ్ సూక్తి గిరీశానికెంతగానో ఉపయోగపడింది. మరీ భ్రష్టత్వం నుంచీ కాపాడింది.

బెంజిమన్ ఫ్రాంక్లిన్ గురించి మహాకవి గురజాడ క్షుణ్ణంగా చదివే ఉంటారు. పూర్‌రిచ్చర్డ్ ఆల్మనాక్‌పై ఆయనకు అపార అధికారమూ లభించి వుంటుంది. అందువల్లనే అంత అలవోకగా గిరీశం నోట పలికించారు. గిరీశం- గురజాడ వారి దృష్టిలో విలన్ కాదు. కుహనా సంస్కారులకు ప్రతినిధి మాత్రమే. బతుకు మిట్ట పల్లాల్లో సాహసయాత్ర సాగించిన దయనీయుడు. మేధా వ్యక్తిత్వంలో మహాకవి గురజాడకు సాక్షాత్తూ మానస పుత్రుడు. ఆంగ్ల సాహిత్యంలో గురజాడ పెంచుకున్న సాన్నిహిత్యం, అడుగడుగునా అవసరమైన మోతాదులో గిరీశం ద్వారా అభివ్యక్తమయింది. సదాశయ స్ఫూర్తికి అంకితమై, నిలవలేని అర్భకుడే తప్ప గిరీశం నిస్సంశయంగా మేధావి. తనకున్న తెలివినీ, సంఘటనా చైతన్యాన్నీ స్వలాభాపేక్షకోసం వినియోగించుకున్న భ్రష్టుడు. ప్రమాదాలను దాటడానికి చమత్కారాన్నీ ఉపజ్ఞనీ వాడుకుని పబ్బం గడుపుకున్న అవకాశవాది. ఆ మహాకవికి గల ఆంగ్ల సాహిత్యవైదుష్యంలో కొంతశాతం గిరీశం పరమై ప్రకాశించడంవల్లనే సమకాలీన సమాజంలో అద్భుతావహమూ ఆకర్షవంతమూ అయిన పాత్రగా రాణించింది. చిరయశశ్వీగా శతాయుష్మంతుడై అజరామరత్వంతో భాసించగలుగుతున్నాడు.

కన్యాశుల్కం నూరేళ్ళ పండుగ ముగింపుకు వస్తున్న ప్రస్తుతం- చిరకాల సంశయంగా వుండిపోయిన పూర్ రిచ్చర్డ్ భోగట్టా లభించినందుకు నాకెంతో ఆనందంగా ఉంది. పూర్‌రిచ్చర్డ్‌లో పూర్ విశేషణం కాదు. బెంజిమన్ ఫ్రాంక్లిన్ సృజించిన ఊహాత్మక పాత్ర ఏకనామమే! గిరీశం ద్వారా అమెరికన్ మేధావుల్లో 18వ శతాబ్దికి చెందిన మహనీయుడు బెంజిమన్ ఫ్రాంక్లిన్‌ను పరోక్షంగా మనకి జ్ఞాపకం చేసిన మహాకవి గురజాడకు కృతజ్ఞతతో జోహార్లు సమర్పిస్తూ నా చిరకాల అన్వేషణకు ఇందుమూలంగా నిష్కృతి లభించడం ధన్యతగా భావిస్తున్నాను

**(16-9-93 విశాలాంధ్ర)**

# 8.ఆంగ్లంలో కన్యాశుల్కం

జయంతి గంగన్న పంతులు- యుగపురుషులు వీరేశలింగం పంతులుగారికి విశ్వాస పాత్రుడైన శిష్యుడు. యుగపురుషుడు నిర్మించిన ఆస్తికోన్నత పాఠశాలకు ప్రధానోపాధ్యాయులు. ప్రఖ్యాతులైన విద్యావేత్త. ఆయన కుమారులంలదరూ ఉన్నతవిద్యా గరిష్టులు. దేశంలోని వివిధ ప్రాంతాలలో గొప్ప ఉద్యోగాలు చేసినవారు. వారిలో సూర్యనారాయణ గారు సి.ఎ. చేసి కలకత్తాలో కంపెనీ మేనేజరుగా పనిచేసారు. ఎస్.ఎన్.జయంతిగా కలకత్తాలో ప్రఖ్యాతుడయ్యారు.

వారు కన్యాశుల్కాన్ని ఆములాగ్రం ఆంగ్లంలోనికి అనువదించారు. 1964లో ఏర్పడిన గురజాడ మెమోరియల్ రీసెర్చి సెంటర్, హైదరాబాద్‌వారు చక్కని గ్రంథంగా నిర్దుష్టంగా ప్రచురించారు. ఆంగ్లానువాదం 200పుటలు. అంకాల వారీగా వారిచ్చిన నోట్సు ముప్పైఏడు పుటలు. జయంతి తమ గ్రంథానికి నాలుగు పుటల పీఠిక రాశారు. "ప్రఖ్యాత రచయితలు కొందరు దీనికి సమతుల్యమైన రచన శూద్రక మహాకవి విరచిత మృచ్ఛకటిక మాత్రమే ఈ నాటకానికి అదే సమతుల్యమైందనీ చెబుతున్నారు, యావద్భారతంలోనూ రాలేదన్నారు. క్రీ॥శ॥ 6వ శతాబ్దికి చెందిన" అంటూ వారు పీఠికలో ప్రస్తావించారు. ఇటువంటి ఉత్తమ నాటకానికి ఇతరేతర భాషల విస్తృత పాఠకలోకం ప్రాప్తించాలన్న సదుద్దేశంతోనే తానీ అనువాదానికి పూనుకున్నామని సవినయంగా వివరించారు.

మృచ్ఛకటిక రచించిన శూద్రకకవి ఒకటవ శతాబ్దానికి చెందినవాడని జవహర్ లాల్ నెహ్రూ తన "డిస్కవరీ ఆఫ్ ఇండియా" అనే ఉద్గ్రంథంలో స్థాపించారు. మృచ్ఛ కటికకూ కన్యాశుల్కానికీ పోలికలున్నాయని చాలామంది గొర్రెదాటుగా అంటున్న విషయమే. ఈ రెండు గ్రంథాలనూ పరిశీలనాత్మకంగా చదివిన వారికి పోలికల కన్నా తేడాలే ఎక్కువగా కనిపిస్తాయి. మృచ్ఛకటికలో ప్రధానపాత్ర శకారుడు హత్యలకు కూడా వెనుదీయని దుర్మార్గుడు. కన్యాశుల్కంలో గిరీశం కుక్షింభరుడైన కుటిలుడు. ధూర్తుడు! హత్యలకు కాదుకదా చేయెత్తడానికి కూడా జంకినవాడు. అందలి వసంతసేన సుందరుడూ, విద్యావంతుడూ అయిన చారుదత్తుని వివాహం చేసుకుందుకే ప్రయత్నిస్తుంది. ఇందలి మధురవాణికి అలాంటి ప్రయత్నంలేదు. నాటకాంతంలో సౌజన్యరావు పంతులపై అలాంటి కోరిక జనించలేకపోలేదు. కాని, వెంటనే పరిహరించు కుంటుంది. పైగా ఈ రెంటికీ నడుమ పదమూడు శతాబ్దాల విభేదం ఉంది. అది

కన్యాశుల్కం ఆద్యంతంగా ప్రదర్శించింది. పంతొమ్మిదో శతాబ్దపు తెలుగువారి సామాజిక సమస్యలనూ, మేధావుల ఆలోచనలనూ దేశీయ పరిస్థితులనూ నిశితంగా ప్రదర్శించింది. రంగస్థలంపై ఇంటిగోడకు పెద్ద కన్నం తవ్వడం అనే అసంగత పరిస్థితి మృచ్ఛకటికలో ప్రదర్శితమైంది. ఈ వ్యాస కర్తకు కన్యాశుల్కాన్ని మృచ్ఛకటికతో పోల్చడం సుతరామూ ఇష్టంలేదు. రెండు గ్రంథాలనూ తులనాత్మకంగా విమర్శించాలని చాలాకాలంగా ఆశిస్తున్నాడు. జయంతి తన పీఠికలో మరికొన్ని విషయాలు కూడా ప్రస్తావించారు. గురజాడ వారి సాహిత్యంలో కన్యాశుల్కం సర్వోత్తమమైనదే! వారే తెలుగులో కథానికకూ ఖండకావ్యానికీ, వ్యాసానికీ ఆద్యులు. సుస్థిర కీర్తి సముపార్జించారు, అనీ వివరించారు, నాటకం గురించి ప్రస్తావిస్తూ ఈ నాటకంలో సంప్రదాయబద్ధమైన నాయికానాయకులు లేకపోవడం గమనార్హం అన్నారు. సజీవమైన నుడికారంలో రచించబడడం వల్ల అనువాదం క్లిష్టతరమైందనీ వివరించారు. ఆమాట నిజమే! కన్యాశుల్కాన్ని ఆంగ్లంలోనికి అనువదించ పూనడం గొప్ప సాహసమే. ఈ సాహస కార్యాన్ని జయంతి విజయవంతంగా నిర్వహించినందుకు అభినందనీయులే.

కన్యాశుల్కం "సాయంకాలమైంది" అనే ఒక గొప్ప మాటతో ప్రారంభమైంది. ఇది పూర్వాపరాలను అనుసంధించే ఆలోచనాత్మకమైన మాట. ఒక దుర్వ్యవస్థకు "సాయంకాలమైంది" ఒక నూత్న వ్యవస్థ ఆగమించనున్నది అని అర్థమూ ఉన్నది ఆమాటలో. 1892లో రచించిన కన్యాశుల్కం తొలి పాఠంలో సైతం "సాయంకాలమైంది" అన్న ప్రారంభమే ఉంది. కన్యాశుల్కం రచించిన తర్వాత పదహారు సంవత్సరాలు ఆ నాటకం గురించి ఏకాగ్ర మథనంతో గురజాడ ఎన్నో మార్పులూ చేర్పులూ చేశారు. పాత్రల పేర్లు సైతం మారిపోయాయి. కాని, ఆ ప్రారంభ వాక్యం అలాగే ఉండిపోయింది. మరో ఎనిమిది సంవత్సరాలలో పంతొమ్మిదో శతాబ్దం ముగిసిపోతుంది. ఇరవయ్యో శతాబ్దంలో శుభోదర్కమైన మార్పులెన్నో రానున్నాయి. అనే గొప్ప సూచనతో మహాకవి ఆ ప్రారంభం చేశారు.

గిరీశం బొంకుల దిబ్బకు వచ్చాడు. విజయనగరం నుంచి బిచాణా ఎత్తివేయాలని బహిరంగంగా ఆలోచిస్తాడు. ఆ ఊళ్ళో అప్పులు పెరిగి ఆబోరు దక్కని పరిస్థితులేర్పడి శీఘ్రమేవ పలాయనం అని నిర్ణయించుకుంటాడు. బొంకుల దిబ్బకు నేపథ్యంలో విజయనగరం మహారాజుల కోట ఉంది. అది శిథిలోన్ముఖమైన జమీందారీ వ్యవస్థకు సంకేతమై నిలుస్తోంది. దానికీ సాయంత్రమైంది. అప్పుడే తల ఎత్తుతున్న బూర్జువా వ్యవస్థాగత నాగరికతలో పుట్టి పెరిగినవాడు గిరీశం! ఆ వ్యవస్థకు గల సహజ దుర్లక్షణాలను అలవర్చుకున్నవాడు, క్షీణత్వం పొందుతున్న వ్యక్తి.

గిరీశం సుదీర్ఘ స్వగతోపన్యాసంలోని ఔచిత్యం చెడకుండా జయంతి ఆంగ్లీకరించారు. కానీ, పూర్ రిచర్డ్‌ను అనువదించేటప్పుడు రిచర్డ్‌కు పూర్ విశేషణంగా

పారబడ్డారు. అదిమొత్తం ఆ మహనీయుని పేరు. అతని సూక్తిని " One can't succeed in this world unless one is patient" గా సొంతంగా అనువదించారు. కొంచెం శ్రమ తీసుకుంటే పుర్‌రిచర్డ్ మూలరచన ఆల్మనాక్‌లో ఈ వాక్యం అసలురూపం లభించి ఉండేది.

ఉన్నవీ లేనివీ కల్పించి డాబులు చెప్పేవాడే కాని, గిరీశం చెప్పేవన్నీ అబద్ధాలు కావు. కొన్ని స్వంతమాటలు కూడా ఎవరో ఒకవేత్త చెప్పినవైనట్లు దబాయించడమూ కద్దు. వక్రబుద్ధి అతన్ని ఆక్రమించిందే తప్ప, బొత్తిగా చదువు సంధ్యలు లేని దద్దమ్మ కాదు. ఎంతో తెలివితో చెప్పే మాటలూ చేసే ఉద్ఘాటనలూ (platitudes) మనకు అబ్బురం కలిగిస్తూంటాయి, ఆకర్షిస్తాయి కూడా. అనువాదంలో గిరీశం పాత్రను చక్కగా అర్థం చేసుకుని జయంతి ఆంగ్లంలో చిత్రించారు.

గురజాడ మహాకవి కన్యాశుల్కానికి ఆంగ్లంలో పీఠిక రాస్తూ " Literature in the Veranacular will knock at the door of the peasant and it will knock at the door of the English man in India, its possibilites are immense". అనే వాక్యం జయంతికి ఎంతో ఉత్సేకం కలిగించి ఈ అనువాదకృషికి దోహదం చేసింది.

ప్రథమాంకంలో వెంకటేశం ప్రవేశించాక పూనా డెక్కన్ కాలేజీలో తానిచ్చిన ఉపన్యాసం "ది ఎలెవెన్ కాజెస్ ఫర్‌ది డీజనరేషన్ ఆఫ్ ఇండియా'' విషయంలో అనువాదకులు యథాతథంగా భాషాంతరీకరణంలో మూల విధేయంగా ఇచ్చి ఊరుకున్నారే తప్ప, నోట్సులో సైతం ది ఎలెవెన్ కాజెస్ గురించి వివరణ ఇవ్వలేదు. కానీ, మూలంలో ఈ వాక్యం తరువాతనే వచ్చే- "మొన్న బెంగాలీవాడు ఈ ఊళ్ళో లెక్చరిచ్చినపుడు ఒక్కడికైనా నోరు పెగిలిందీ?'' అనే వాక్యం గురించి కూడా నోట్సులో కొంత వివరించి ఉండవలసింది. ఆనంద గజపతి మహారాజును దర్శించుకునేందుకు సురేంద్రనాథ్ బెనర్జీ తరచు విజయనగరం వచ్చేవారు. ఆ[illegible]న ఉపన్యాసం వింటూ మేధావులు నోళ్ళు వెళ్ళబెట్టేవారు. ఈ పదకొండు కారణాల ప్రసక్తి రాగానే- బెంగాలీ మేధావిని పేర్కొనడం ద్వారా "భారతదేశ పతనానికి పదకొండు కారణాలు'' అనే శీర్షికతో ముందుగా ఉపన్యాసమూ, తదుపరి వ్యాసమూ అందించినది సురేంద్రనాథ్ బెనర్జీయేనన్న సంగతి గురజాడ దాచిపెట్టారు. ఈ వ్యాసకర్త గత ఐదారు సంవత్సరాలుగా బెనర్జీగారి ఉపన్యాసాల సంపుటి కోసం అన్వేషిస్తున్నాడు. ఆ గ్రంథం లభిస్తే ఈ శీర్షిక గల వ్యాసం ద్వారా మనకెన్నో భోగట్టాలంది ఉండేవి. ఇంతవరకూ పరిశోధకులెవరూ ఇంతదూరం వెళ్ళలేదు.

అనుస్యూతంగా ప్రతిపాత్ర సంభాషణనూ మూలంతో పోల్చి చదువుతున్నప్పుడు దాదాపు మూల విధేయంగానే అనువాదం సాగిందనడం అతిశయోక్తికాదు. జయంతి

ఇంగ్లీషు భాషలో నిష్ణాతులే కాక, ఆధునిక ఆంగ్లరచనా రహస్యాలెరిగిన వారు. సంగ్రహంగా చెప్పిన తెలుగు సంభాషణను కొన్నిచోట్ల వివరంగా దీర్ఘం చేయవలసి వచ్చింది. ఇది తప్పనిసరే! అయినా ఒక ఉదాహరణ. అగ్నిహోత్రావధాన్లు ధుమధుమలాడుతూ ఈ శషభిషలు నాకేం పనికిరావు అనే డైలాగు తర్వాత, వెంకమ్మ 'ఆయన మాటలు గణించకు బాబూ ఆయన మోస్తరు అదీ! మీ దయవల్ల మా బాబుకి ఓ ముక్క అబ్బితే మీ మేలు మర్చిపోలేం'. అన్న మాటలకు అనువాదంలో "Don't you please take him seriously; that is his way of talking, indeed we are greatful to you! after all it is entirely due to your kindness that he has picked up a few words" వంటి వాక్యాలు కొన్ని వివరణాత్మకంగా చొచ్చుకున్నాయి. కానీ చాలాచోట్ల సంగ్రహంగానూ చక్కని ఆంగ్ల నుడికారంతోనూ అనువదింపబడింది.

జయంతి ఏకాకిగా ఈ కృషి సల్పారు, విజ్ఞతగల మిత్రుల సలహాలు సంప్రదింపులూ లేవు, ఉన్నంతవరకూ మూలాధారంనుంచి సడలక ఆంగ్లానువాదాన్ని మనోజ్ఞంగా అందించడం ఆయన ఆశయంగా పెట్టుకున్నారు. తెలుగు భాషతోనూ, సాహిత్యం తోనూ ఈషన్మాత్ర సంబంధంలేని ఆంగ్ల పాఠకులకు ఈ ఆంగ్ల కన్యాశుల్కం హృద్యంగా సాగిపోతుందని నిశ్చయంగా చెప్పవచ్చు. మహాకవి ఉద్దేశించిన హాస్యరసం ఆంగ్లంలో సైతం చిప్పిల్లుతూ సాగడం ముదావహమే, గిరీశం కరటక శాస్త్రిని ముందునుంచీ ఎరిగినట్లు కస్సాలు కొడుతూ డిప్టీ కలెక్టరుగారి ప్రసక్తి తెస్తాడు, "కవితారసం ఆయనలా గ్రహించేవారేరి? నా కవిత్వమంటే ఆయన చెవి కోసుకుంటారు" అంటూ పనిలోపనిగా తన్ను తాను కవిగా పరిచయం చేసుకుంటాడు. ఆత్మస్తుతీ జరుపుకుంటాడు. గిరీశానికి ప్రాప్త కాలజ్ఞత మెండు. అదే వాడ్ని రక్షించిందికూడా. సరిగ్గా సమయానికి వేయవలసిన మాట వేయడంలో అద్వితీయుడు. గిరీశం ప్రజ్ఞావంతుడే, కాని వంకర్లు తిరిగి పోయాడు. శిక్షణలేదు. ఆ పాత్ర నిర్మాణాన్ని జయంతి చక్కగా అర్థం చేసుకున్నారు.

గిరీశం మాటల్ని ఆయన ఇలా అనువదించారు. " Now-a-days we rarely come across cultured people like him, who understands and apreciates fine arts. He was mad over my poetry"- అంటూ తెలుగు వాక్యంలోని సారాంశాన్నీ జీవధాతువునీ చక్కగా ఆంగ్లీకరించారు.

ఒకసారి వెనక్కి వెడదాం. విజయనగరంలో కాలంగడిపే అవకాశాలన్నీ సన్నగిల్లి పోయాయి. ఎక్కడ చూసినా అప్పులే! అప్పుల వాళ్ళ దాడులే. అట్టి స్థితిలో గిరీశం శీఘ్రమేవ పలాయనం అని నిశ్చయించుకుంటాడు. వెంకమ్మ అమాయకంగా తన భర్త మాటలు పట్టించుకోవద్దని ఇక్కడే ఉండి నాలుగు ఇంగ్లీషు మాటలు చెప్పమని

అర్థిస్తుంది. గిరీశం ఆ అవకాశాన్ని వినియోగించుకుని వెంకటేశం తన్ను బతిమాలి తీసుకువచ్చాడని చెప్పుకుంటాడు. ఆ మాటలు తెలుగు నుడికారంలో వచ్చినంత తీక్షణంగా ఇంగ్లీషులోకి రావడం కష్టం. తెలుగులో చదువుతూంటే గిరీశం మొహంలో ఎలాంటి మాయరంగులు మెరుస్తున్నాయో, ఎలాంటి కోతలు కోస్తున్నాడో అర్థమౌతుంది. కాని ఆంగ్లంలో ఆ వ్యంగ్యం స్ఫురించలేదు. సజీవ భాషలో చక్కని నుడికారంలో వెలువడిన కన్యాశుల్కాన్ని ఆంగ్లీకరించినపుడు ఈ ఇబ్బంది తప్పదు. గురజాడ స్వయంగా అనువదించినా ఇబ్బందులు కలిగేవేకాని, ఈ ఆంగ్లానువాదాన్ని సాధ్యమైనంత హృద్యంగా సాగించడానికే జయంతి ప్రయత్నించారు. ఆయనకు గల వైదుష్యం సహకరించింది.

తృతీయాంకంలో మధురవాణి రామప్పంతులు సంభాషణ చివరలో ఇలా సాగుతుంది. మధురవాణి- "మీనాక్షి ప్రవర్తన బాగుందికాదంటూ మీరే చెప్పాలి? మీ కంటబడ్డ తర్వాత ఏ ఆడదాని ప్రవర్తన తిన్నగా ఉంటుంది?"

**MADHU:** "I am suprised that you, of all the people should comment on Meenakshi's character! which lady would keep to herself once she gets within your bounds"

అని వెక్కిరించి ఎట్టి పరిస్థితుల్లోనైనా మీనాక్షి తండ్రిని ఈ పెళ్ళినుండి దూరం చేయాలని నొక్కి వక్కాణిస్తుంది. లుబ్ధావధాన్లు కన్యాశుల్కం ముందే ఇచ్చి పెళ్ళి ఏర్పాట్లు చేసుకున్నాడు. ఐదవ అంకం, ఆరవ రంగస్థలంలో రామప్పంతులు- పెళ్ళికూతురు వేషంలో ఉన్న కరటక శాస్త్రి శిష్యుడు కంటెపోయిన ఉదంతంలో పోలీస్ హెడ్ కానిస్టేబుల్‌తో మొరపెట్టు కుంటాడు. ఆ సందర్భంలో

**హెడ్ కానిస్టేబుల్ :** "ఓహో ఇదావేషం? పోలీసు ఆఫీసర్ని నేను సాక్ష్యాలకీ సంపన్నాలకీ తిరిగితే నా నౌఖరీ నిలుస్తుందా? కావలిస్తే లుబ్ధావధాన్లు కంటె హరించాడని నాదగ్గర ఫిర్యాదు చేయండి. కేసు చేసి తమాషా చూపిస్తాను"

**రామప్ప :** "కంటె మాట నీదగ్గర అతడు ఒప్పుకున్న తర్వాత, మీరు బోనెక్కి ఎలా అబద్ధం ఆడగల్రో చూస్తాను గదా? అన్న ఈ రెండు డైలాగులకూ 143వ పేజీలో ఆంగ్లానువాదం ఇలా

**HEAD:** Oh I see! that is your plan! you don't suppose I am not a free bird like you to wander about courts. If you want me to enquire in to the matter-give me a complaint in writing and say that he stole your necklace. Then of course I can start and keep the ball rolling.

**RAMA:** When he has already admitted about the necklace in your presence, how can you deny knowledge of it in a court of law?"

పైన ఇచ్చిన మూలంలోని సంభాషణనూ, అనువాదంలోని సంభాషణనూ వాచవిగా

చూపించడం అవసరం అయింది. తెలుగులో 'కంటె' అనే ఆభరణం అరవై ఏళ్ళక్రితం వరకూ ఇంటింటా ఉండేది. స్థోమతను బట్టి బంగారమో, వెండో! బంగారపు కడ్డీని గుండ్రంగా వంచి తయారు చేసిన ఆభరణమది. దానికి సమానార్థకమైన ఆంగ్లపదం లేదు. ట్విస్టెడ్ రాడ్ అంటే బావుండదు. కనక జయంతి నెక్‌లెస్‌గా అనువదించారు. మరికొన్ని మినహాయింపులూ చేశారు. ప్రధాన కథావాహికలు కాని మునసబు బైరాగి వంటి కొన్ని పాత్రలు మినహాయించారు. అవి తెలుగు పాఠకులకెంతో రంజుగా ఉంటాయి. కాని, ఆంగ్లీకరణలో ప్రాణరహితం కావచ్చు. బహుశా అందుకే ఆయన భయపడి ఉంటారు. 1892లోనే వెలువడిన మహత్తర నాటకం కన్యాశుల్కం. దాన్ని గురజాడ తమ జీవనకృషికి పతాకసన్నిభ మొనర్చుకున్నారు. దాన్ని పదిహేడేండ్లు పునర్నిర్మిస్తూ మార్పులు చేస్తూ చివరికి సంపూర్ణ రూపాన్ని 1909లో ప్రచురించారు. ఇరవయ్యోశతాబ్ది ఆరంభ దశాబ్దిలో వెలువడిన రెండవ కన్యాశుల్కమే యావత్సాహిత్యానికి మణిమకుటమై వెలిగింది.

దాన్ని ఎన్నోమార్లు అధ్యయనం చేసి జీర్ణం చేసుకుని ఇంగ్లీషులో అనువదించడానికి తగిన బందోబస్తు కూర్చుకుని ఈ విజయం సాధించడం గొప్ప సంగతి. ఎంతో అభిమానంతో గురజాడ కృతులు అధ్యయనం చేసే పాఠకులలో చాలామందికి ఆంగ్లంలో కన్యాశుల్కం గురించి తెలియదు. ముప్పై ఆరు సంవత్సరాల క్రితం వెలువడిన ఈ గ్రంథం ప్రతులిప్పుడు లభ్యంకావు. దీని ద్వితీయ ముద్రణ వెలువడడం తెలుగు వారికొక గర్వకారణం. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు అవశ్యం సంకల్పించి ఆ మహత్తర కార్యం చేయాలి. కేద్ర సాహిత్య అకాడమీ సహాయ సహకారాలతో యావత్భారతస్థాయిలో విడుదల చేయాలి. అప్పుడు మన మహాకవికి ఋణం తీర్చుకున్న వాళ్ళమవుతాం.

జయంతి సూర్యనారాయణ పన్నెండేళ్ళ క్రితం నిస్సంతుగా చనిపోయారు. ఆయన భార్య కాకినాడకు చెందిన దేవర కొండవారి ఆడపడుచు. ఆమెకూడా కొన్నేళ్ళ క్రితం చనిపోయారు. ఈ ఆంగ్ల కన్యాశుల్కం కాపీరైట్ హక్కుల గురించి వివాదం చేసేవారెవరూ లేరు. తెలుగు కన్యాశుల్కంతో తులనాత్మకంగా కాక, నేరుగా ఆంగ్ల కన్యాశుల్కాన్ని అధ్యయనం చేసినపుడు నాకే సంశయాలూ కలగలేదు. కన్యాశుల్కం నాటకకథ చమత్కారాలతో తేజస్వంత భావజాలంతో సాగిపోతుందని కొత్తగా చెప్పుకోనవసరం లేదు. అలాగే ఆంగ్లానువాదం కూడా సాఫీగా సంశయ రహితంగా సాగుతుంది. ఇంతకన్నా గొప్ప అనువాదాన్ని కన్యాశుల్కానికి అందించగలరనుకోవడం సాధ్యంకాదు, మన భాష నుంచి సమగ్ర గ్రంథంగా ఆంగ్లానువాదం పొందినవే అరుదు. అట్టిసందర్భంలో ఆంగ్లంలో కన్యాశుల్కం వెలువడ్డం గొప్ప అదృష్టమని వేరుగా చెప్పనక్కరలేదు.

(18-9-2000 విశాలాంధ్ర సాహిత్యానుబంధం)

## 9. సమగ్రవిమర్శకులు-గురజాడ.

కవిత్వం శ్రాద్ధ మంత్రం కాదు. అని ఉద్ఘాటించిన వారు మహాకవి గురజాడ వేంకట అప్పారావు. ఎనభై ఏళ్ళ క్రితం పలాసా వాస్తవ్యులు గుమ్మలూరి లక్ష్మీనరసింహ శర్మగారికి రాసిన లేఖలో ఇలా వక్కాణించారు. "ఛందశ్శాస్త్రమంతా శ్రుతి రంజనమునకు సాధన భూతమయింది. గాని శ్రాద్ధ మంత్రము లాగు మారుదలకు వీలులేనిది గాదు!"

చరిత్రాంశాల గురించి గాని, భాషా శాస్త్రాంశాల గురించిగాని, శాసనాదుల కాలనిర్ణయం గురించి గాని, కవిత్వ పరిణామం గురించిగాని ఆయనకు క్షుణ్ణమైన అభిప్రాయాలున్నాయి. ఆయన అభిప్రాయాలన్నీ సశాస్త్రీయమైనవీ, హేతువాద బద్ధమైనవీ, వాస్తవికతా దర్శనపై పెంపొందినవీను.

తాను సృజించిన సాహిత్య రచనలకోసమని, సమగ్ర సిద్ధాంత పధకం ఆయనకుంది. తన సాహిత్యోద్యమం ప్రజల ఉద్యమమన్న స్పృహ సంపూర్ణంగా ఉంది. అందుకే ఈ శతాబ్ది ఆరంభం నాటికే తాను నిర్వహించ వలసిన పాత్ర ఏమిటో పోల్చుకోగలిగాడు. వెనుకచూపు వాదాలన్నిటినీ ఘనతర ధీశక్తితో ఎరుర్కొన్నాడు. ఆధునిక సాహితీ చైతన్యాన్ని నిర్విఘ్నంగా పాదుకొల్పాడు. ఆయన బతికిన ఏభయ్యారేళ్ళ అల్పకాలంలో ఎన్ని మహత్తర కార్యాలను నిర్వర్తించినా- ఆయన మేధాశక్తికీ, ప్రతిభకీ సంపూర్ణ ఆవిష్కారం జరగనేలేదు.

గురజాడ సాహిత్యం గురించి ఆలోచించే సందర్భంలో కీ॥శే॥ అవసరాల సూర్యారావు స్మరణలో నిలుస్తాడు. అతడు వారి సాహిత్యాన్ని సమగ్రంగా ప్రజల కందించాలని ఎంత తాపత్రయ పడ్డాడో, అహర్నిశలు ఎంత శ్రమించాడో ఈ సమీక్షకుడు స్వయంగా ఎరుగును. ప్రస్తుతం గురజాడ రచనలను సంపాదకులుగా ప్రచురిస్తున్న శ్రీ సెట్టి ఈశ్వరరావు పీఠికలో అతన్ని ఒక్క మాటతోనైనా స్మరించకపోవడం బాధాకరమే.

గురజాడ రచనలు సెట్టి ఈశ్వరరావు పునః పరిశీలనతో పునః పరిష్కారంతో ప్రచురిస్తున్న వ్యాస సంకలనం పరామర్శిస్తున్నప్పుడు గత చరిత్రలో వ్యాస చంద్రిక అస్మదాదులపై కలిగించిన అపార ప్రభావాన్ని స్మరించుకోకుండా సాగడం న్యాయంకాదు. శ్రీ ఈశ్వరరావు ఆరంభ యౌవ్వనదశ నుంచీ సాహిత్యోపాసకులే. మంచి కథలుగా పేరు తెచ్చుకున్నారు. ఉత్తమ సంపాదకులుగా విజయం పొందారు. 1945లోనే- 'మహాకవి-మహాపురుషుడు గురజాడ అప్పారావు' అనే శీర్షికతో ప్రప్రథమంగా ఒక మోనోగ్రాపు

రచించి, అభ్యుదయ రచయితల సంఘం పక్షాన ప్రచురించారు. ఆయనే గురజాడ రచనల పునర్ముద్రణకు పూనుకోవడం ముదావహమే కాని- 'బహుముఖ వైదుష్యం అనే శీర్షికతో ఆయన రచించిన నాలుగుపుటల పీఠికలో మాట వరసకైనా అవసరాల పేరు స్మరించక పోవడం మాత్రం క్షంతవ్యం కాదు.

ఇక ప్రస్తుతానికి వస్తే గురజాడ వ్యాస సంకలనం అనే గ్రంథంలో, 1953లో అవసరాల సంకలనంగా వెలువడిన వ్యాసచంద్రికలో మరికొన్ని వ్యాసాలు అదనంగా చేర్చబడ్డాయి. చిన్నవీ పెద్దవీ ఇందులో నలభై వ్యాసాలు వున్నాయి. సమకాలీన వ్యవహార భాషా ప్రముఖుల చిత్రాలారు, గ్రాంథిక భాషా ధురంధరుల ఫోటోలారు వెదికి ముద్రించడం సంతోషకరమే.

ఈ గ్రంథం గురించి సాంగోపాంగంగా సమీక్షించే ముందు ఒక సత్యం చెప్పి తీరాలి. ఇంత ఉదాత్త గ్రంథాన్ని ఎన్నిమార్లు చదివినా యింకోమారు చదివి, పునశ్చరణ చేసుకోవాల్సిన అమూల్య విషయాలు మిగిలిపోతూనే వుంటాయి. మా తరం సాహితీపరులం, ఏభయిలలో గురజాడ గ్రంథావళిని అపురూపరత్న పేటికలుగా అందుకొని, మా అవగాహనా పరిధిని పెంచుకున్నాం. నాలుగు దశాబ్దాల క్రితం కన్న నేడు సాహితీ విద్యార్థుల సంఖ్య పెరిగింది. పాఠకులూ పెరిగారు. విశ్వ విద్యాలయాల సంఖ్య అపారమైంది. తెలుగు సాహిత్య పరిశోధకుల సంఖ్య కూడా తామర తంపరగా పెరిగింది. అయితే అలా పెరిగిన ద్రవ్యాత్మకాభివృద్ధికి ఓటుగా గుణాత్మకాభివృద్ధి పెంపొందాలంటే గురజాడ మనో వికాసం గురించి సమగ్ర అధ్యయనం ఎంతో అవసరం. ముఖ్యంగా ఈ వ్యాస సంకలనాన్ని ఒకటికి పదిసార్లు అధ్యయనం చేసి, విలువైన సంగతులెన్నో రక్తనిష్ఠం చేసుకోవలసిన పూచీ విద్యార్థులపైన, పరిశోధకులపైనా, ఆచార్యులపైనా ఎంతో ఉంది. నిజానికీ గ్రంథం వెలతక్కువే, కాని విలువ అనంతం. సాహితీపరులంతా అక్షరాక్షరం హృదయాలలో నిక్షిప్త మొనర్చుకోవాలని ఆశిస్తున్నాను.

ఈ అమూల్య గ్రంథాన్ని ఎంత విపులంగా సమీక్షించినా గ్రంథ పఠనంలోని పరిపూర్ణానుభవం కలిగించడం సాధ్యంకాదు. కొండంత దేవుణ్ణి పూజించడానికి కొండంత పత్రి తేనూలేం. అందుకే ఈ సాహిత్య పర్వతాన్ని దర్పణ బద్ధం చేస్తూ పాఠకులకు చూపించదలిచాను.

"వాడుక భాషను కులట అని మర్యాద చేసే పండితులు దానిని దూరముగా విసర్జించక యేల వాడుక చేతురో? వారు యాంటీనాచ్‌కారు కాబోలును!" అన్నారు గురజాడ. పండితబ్రువుల దుర్యోగాలను పరాస్తం చేసే సమయాల్లో కూడా తమ చమత్కార నిశితాయుధం ప్రయోగించక విడువరు.

"మాలవాణ్ణి చూడగానే అమాంతం కౌగిలించుకోలేని వాడికి దేశమాత పేరు ఎత్తే అర్హత లేదని నాగట్టి నమ్మకం!" అన్న మాటను 1910లోనే అనగలిగిన చేవ మన గురజాడదే! అప్పటికింకా గాంధీ దేశ రాజకీయాలలో ప్రవేశించలేదు. హరిజనోద్యమం, సంఘ సంస్కరణకర్తలైన వివేకానంద, దయానంద సరస్వతి, రాజారామ్ మోహనరాయ్ ప్రభృతుల చర్యలలోనే ప్రారంభమైంది.

"సొగసులేని మనిషే ఉండడు. స్నేహము, ప్రేమ అనేవి అనాది అయిన్నీ ఎప్పటికీ సరికొత్తగా ఉండే రెండు వెలుగులను నరుని మీద తిప్పి కాంచితే- వింతవింత సొగసులు బయలుదేరుతవి. అసూయ అనే అంధకారంలో అంతా ఏక నలుపే!" అనగలిగిన మానవతాద్రష్ట గురజాడ. మానుషత్వాన్ని ప్రేమించగలిగితే ఏ మనిషీ ద్వేషించవలసిన కారణమే కనిపించదు. అందుకే ఆయన తన్ను గురించి సత్యమే చెప్పుకోగలిగాడు. "నా అంత మృదువుగా తప్పులు విజ్ఞాపన చేసేవారు లేరని నా అభిప్రాయము!" అని.

"నిజంగా ఆలోచిస్తే విద్యా సమస్యలపై యిప్పుడు మనకు ప్రతిభావంతమైన పబ్లిక్ ఒపీనియన్ లేదు". అని మహాకవి 1895లో అన్నమాట నేటికీ మనదేశంలో పచ్చి నిజంగానే సాగుతూంది. విద్యాధికులు కాని రాజకీయవేత్తల జోలికి విద్యను వదలి, విద్యాధికులు నిర్లిప్తులవుతున్నారు. స్వాతంత్ర్యం లభించిన తర్వాత నాలుగు తరాలు సాగినా మన విద్యకు సుష్టురూపం ఏర్పడనే లేదు. ప్రయోగాల దశ దాటనూలేదు!"

ఈనాడు మనజాతి అనుభవిస్తున్న ఒక భయంకర శాపం గురించి గురజాడ ఆనాడే హెచ్చరించాడు. "విద్యావ్యాపార సంస్థలు మనజాతి భవిష్యద్దాతలను" మానసిక వికలాంగులుగా మారుస్తున్న దురవస్థను నేటికీ మనం గుర్తించలేక పోతున్నాం. కాని మన మహాకవి ఆనాడే ఇలా అన్నారు: "ప్రైవేటు మేనేజిమెంట్‌కి సంస్థలను అప్పగించడం అనేది చేయరాని మహాదోషం. అంతకంటే హానికరమైన పని మరొకటిలేదు. నగరాలలో వున్న పాఠశాలలు, కళాశాలలు యెంతటి అవకతవకగా బేసబబుగా నిర్వహింప బడుతున్నాయో, వాటికి అజమాయిషీ వహించే కమిటీలు యెంత అరాచకంగా ప్రవర్తిస్తున్నాయో ఊహించలేం! కమిటీలకు ఉన్నదల్లా అహంకారం ఒక్కటే! బాగుపడే విధానమేదో వారింకా గ్రహించినట్టు లేదు!".

గురజాడకు ఆనాటి దేశీయ భాషల స్థితిగతులు గురించి సమగ్ర అవగాహన ఉంది. తరచుగా కలకత్తా వెళ్లి రవింద్రునితోనూ ఇతర బెంగాలీ పండితులతోనూ సాహిత్య చర్చలు జరిపేవారు. అలాగే బొంబాయి రాష్ట్రంతోనూ సన్నిహిత సంబంధం పెట్టుకున్నారు. అందుకే వారిలా అనగలిగారు. "బొంబాయి బెంగాలీ రాష్ట్రాలలో వాడుకభాష సంస్కృతానికి సంబంధంగల భాషల నుండి ఏర్పడింది. సంస్కృత కావ్యాలను

చదవడమనే కార్యం సంస్కృతిలో ఒక అంతర్భాగంగా ఆ రాష్ట్రాల సారస్వత సంప్రదాయం పరిగణిస్తుంది.'' మన పరిస్థితి అలా లేదు. అందుకే ఇలా అన్నారు. "వాడుక భాష వొకరీతిగాను కావ్యభాష మరో రీతిగానూ ఉండడమనే ద్వంద్వ భావం ఒక చెడుగుకు కారణమైంది''

ప్రతిభ సన్నగిల్లింది. బుద్ధివికసించక కుంటుపడి, సాహిత్యం మందగించింది. ఈ యథార్థాన్ని ఎంత సనాతనుడైనా నేడు ఖండించగలడా?

చారిత్రక విషయాల పట్ల గురజాడ బహుకుశలుడు. విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి గ్రంథాలలో కొమర్రాజు లక్ష్మణరావు సముచిత పరిశోధన జరపకుండా చేసిన చారిత్రక దోషాలను సైతం ఆయన ఉపేక్షించలేదు. ఆయన ఇలా అంటాడు. "దక్కను పాలించిన ముస్లీములలో కల్ల బహుశా ఇబ్రహీం కుతుబ్‌షా గొప్పవాడని చెప్పవచ్చును. విద్యలమీద అతనికి ఆదరణ హెచ్చు. అందులోనూ ప్రాచ్యదేశాల సాహిత్యమంటే మరీ అభిమానం. ప్రసిద్ధి గాంచిన ఇద్దరు తెలుగు కవులు తమ కావ్యములను ఈ సుల్తానుకు అంకితమిచ్చారు. హిందువులపై తమ పోషకులు జరిపిన దండయాత్రలను, విజయాలను ఈ కవులు స్తుతిస్తూ హిందూ దేవుళ్ళతో వారిని పోల్చి వర్ణించారు. ఇబ్రహీం కుతుబ్‌షా గురించి ఫెరిష్తా తన గ్రంథంలో ఎంతో స్తుతించాడన్న విషయం మరువకూడదు.'' అంటూ వివరించారు.

తానుగా సృజించి తెలుగు కవిత్వానికిచ్చిన ముత్యాల సరాల లక్షణం గురించి ఎంతో ఉపజ్ఞాపూర్వకంగా వివరించారు. ఆయన ఏ పని చేసినా ఎంతో అవగాహనతోనూ, పరిశోధన తోనూ చేశారే తప్ప- గుడ్డి గుర్రపు తాపుగా ఏదీ చేయలేదని అర్థమవుతుంది. ఈ గ్రంథంలో గల నలభై వ్యాసాలలో ఏదీ ఉపేక్షింపతగింది కాదు. శ్రద్ధా భక్తులతో అవలోకించ వలసిందే! నేను ముందే చెప్పినట్లు ఈ గ్రంథ మహత్వాన్ని ఏ సమీక్షలూ, పాఠకులకెలాగ ప్రత్యక్షం చేయలేవు. సాహిత్యాభిరతులా గ్రంథాన్ని నిరంతర పఠనీయ గ్రంథంగా పరిగణించి తక్షణమేహస్త భూషణ మొనరించుకోగలిగితే ఈ వ్యాస కర్త ధన్యుడే! సోదర పాఠకులున్నూ అదృష్టవంతులే!

గ్రంథాంతంలో సంపాదకులు గురజాడ గ్రంథాల నుంచి కొన్నిగొప్ప సూక్తులను క్రోడీకరించారు. వాచవిగా అందులోంచి రెండుమూడు: "కొందరితో మాట్లాడుతున్నప్పుడు కొందరు తమ మనోవ్యథ తీరినట్లు ఫీలవుతారు. అలాంటపుడు వారిని చివరి వరకు మాట్లాడనీయడం మంచిది. వారి హృదయం తేటపడి ఉల్లాసం కలగడం సంతోషమే కదా!''

" మంచితనమే దైవము. మంచిని పెరగనివ్వాలి. మంచిని ప్రేమించడమే దైవమును

ప్రేమించడం. దుర్గుణములను రోసి ఆత్మ సుగుణ సంపత్తిని పెంపొందించుకుంటున్న కొద్దీ- అది దివ్యత్వమును పొందుతుంది...."

"ఒకపని చేసేముందు అది ఇతరుల కంటికి ఎలా ఆనుతుందో ఆలోచించు.... ఎవరికైనా తెలుసుకున్న దానికంటే తెలుసుకోవలసిందే ఎక్కువ. వృద్ధాప్యం మన శరీరాలకు మాత్రమే"!

ఇలా ఎన్నని?

మహాకవి గురజాడ నిస్సంశయంగా ఉదాత్తహృదయుడు.

**(ఆంధ్రప్రభ 25మే, 1995)**

# 10. రాయప్రోలు, విశ్వనాథలపై గురజాడ ప్రభావం

రాయప్రోలు సుబ్బారావు శతజయంతి సాహితీ పరులందరికి ఆనందోత్సవమే. ఏకవి సాధించిన విజయాలనైనా నిశిత దృష్టితో పరిశీలించుకొని నిరంతర పరిణామ శీలమైన సామాజిక సందర్భాన్ననుసరించి విలువల మదింపు చేసుకోవడం అవసరం. కేవలం నిందాస్తుతులతో సాగడం ద్వేషానురాగాలకు మాత్రమే ప్రతిఫలనం కాగలదు. రాయప్రోలు వారి అభిప్రాయాలననుసరించి జాతీయ వాదులు విపరీత ప్రశంశలతో అతిశయోక్తులు పలకడం ఎందువల్ల జరుగుతున్నదో కూడా ఆలోచించుకోక తప్పదు.

నవ్య కవిత్వానికి గురజాడ- రాయప్రోలు లిరువురూ ప్రవక్తలన్న అచారిత్రక నిర్ణయం ఏ దుర్ముహూర్తంలో జరిగిందో కానీ దానికన్న అసత్యమూ అసంగతమూ మరియొకటి ఉండే అవకాశం లేదు. నవ్య కవిత్వానికే కాదు- నవీన మానవతావాద కవిత్వానికి సైతం గురజాడ వారే నిస్సంశయంగా ఆద్యులు. ఆధునిక హేతువాద విచికిత్సను సాహిత్యానికందించిన క్రాంతదర్శి గురజాడే! రాయప్రోలు వారు గురజాడ తర్వాతనే తెలుగు సాహిత్య ప్రవేశం చేసారు. రవీంద్రుని శిష్యునిగా భావ కవిత్వాన్ని పరిపుష్టం చేసారు. గురజాడ, రవీంద్రులూ షుమారు ఒకే సంవత్సరం జన్మించినవారు. స్నేహ పారస్పర్యం పెంపొందించుకున్న వారు. దఫ దఫాలుగా కలుసుకుంటూ చర్చించుకున్న మనీషులు.

19వ శతాబ్ది చివరి వరకూ తెలుగు కవిత్వాన్ని గబ్బు పట్టించిన అశ్లీల శృంగారాన్నీ, గతానుగతికత్వాన్నీ దూరీకరించిన వారు రాయప్రోలు. ప్రబంధ సాహిత్యంలో తిష్ట వేసిన అంగాంగ వర్ణనలకు, పరస్పరానుకరణలకు, స్వస్తి పలికిన వారు. తెలుగు కవిత్వం నిండా దేవతలో పితృ దేవతలో తప్ప సమకాలీన సజీవ మానవ హృదయ ప్రతిస్పందన లెరుగని వైపరిత్యానికి తెరజార్చినవాడు. ఆంధ్రోద్యమ దీప్తికి ఉత్ప్రేరకమైన గొప్ప పద్యాలందించిన కవిగా, తెలుగు పద్యాన్ని సుందర సుకుమార మూర్తిగా శిల్పీకరించిన కవిగా, రాయప్రోలు అవిస్మరణీయుడే! లలితమైన జీవిత వృత్తాలను స్వీకరించి మానవాను బంధాలను పునర్నిర్మించిన శ్లాఘనీయుడే!

అంత మాత్రంలో వారి సాహిత్యంలో గల ఋణ ధ్రువాలను బుద్ధి పూర్వకంగా మత పునరుద్ధరణ వాదులు విస్మరించడం ఉపేక్షించ తగినది కాదు. నవ్య కవితా నిర్మాణంలోగాని, ఆధునిక చింతనను పాదుకొల్పడంలో గాని గురజాడ పాత్ర ఏమీ

లేనే లేదని ఉన్నదంతా రాయప్రోలుదేనని- సత్య విదూరమైన నిర్ణయాలను పదే పదే వల్లె వేస్తున్నారు. బుద్ధి పూర్వకంగా జాతిని తప్పు మార్గంలో నడిపించాలని జాతీయ సాహిత్య మేధావులు నిరంతర ప్రయత్నం చేస్తున్నారు. ఇదీ శోచనీయ పరిస్థితి!

గురజాడ ప్రభావంతోనే రాయప్రోలు పద్య ఛందస్సులనుంచి కవిత్వానికి పరివర్తన శక్తిని ఘటింపజేసాడు. ఆయన మనస్సును సహజంగా ఆకట్టుకున్న నేషనల్ షోవెనిజంతో "ఏ దేశమేగినా ఎందు కాలిడినా పొగడరా నీతల్లి భూమి భారతిని" వంటి గేయాలు రచించాడు. జాతీయ పునరుజ్జీవన వాదానికీ జాతీయ దురహంకారానికీ నడుమగల సరిహద్దుల నాయన గుర్తించలేకపోయాడు.

మన ప్రాచీనులెన్నో విజయాలను సాధించారు. వాటికి మనమే వారసులం, నీరసులమై పడి ఉండటం తగదు. అనే భావంతో ప్రభోదించడం వేరు! ప్రపంచమంతటికీ మనమే జ్ఞానభిక్ష పెట్టామనీ, మన జాతివంటిది ప్రపంచంలో మరెక్కడా లేదనీ, గత జన్మలో మంచిమంచి పూవులతో పూజలు చేయడం వల్లనే మనకీ మహత్తర దేశంలో జన్మించే సదవకాశం కల్గిందనీ ప్రచారం చేయడం మాత్రం సంకుచిత దృష్టి.

గురజాడ తాము రచించిన ప్రతీ అక్షరం గురించీ సహేతుక చైతన్యంతో హేతుబద్ధ కాంతినే ప్రసరించారు. యుగపురుషునికి కావల్సిన తాత్త్విక సమదర్శనతో చింతన చేసిన వాడు, కన్యాశుల్కం పునర్నిర్మిత ముద్రణకు ముందుమాట రాస్తూ "తెలుగు జీవద్భాష ఎంత ఉన్నతమైనదో నాకు తెలుసు. సాంప్రదాయ వాదులు దానినే నిస్తేజమొనరిస్తున్నారు. శృంఖలాలను ఆరాధించే వారిని మనం విస్మరిందాం. నా హృదయంలో మారుమ్రోగే జీవద్భాష- అదే నా దృష్టిలో సజీవ చైతన్యం గల భాష! అదే ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్‌గా శతాబ్దాల కీర్తి పొందింది. ఈ జీవద్భాషలో మన హృదయ భావాలను వ్యక్తం చేసేందుకు మనమెవ్వరమూ సిగ్గు పడనక్కరలేదు. మన కష్టసుఖాలను ఆభాషే పటిష్టవంతంగా అభివ్యక్తం చేయగలదు. కానీ సాంప్రదాయ వాదుల మనుకునే పండితబుధ్రులు ఈ జీవద్భాషలోనే రాయడానికి సిగ్గుతో చీలిపోతున్నారు. మనం వ్యవహారిక భాషలో రాస్తే మన సాహిత్య వాణి సామాన్య రైతుల ద్వారాలను తట్టి మేల్కొల్ప కలదు. భారతదేశ పాలకుల కోట గుమ్మాలను సైతం బాద కలుగుతంది. దానికి గల అవకాశాలూ సాధ్యాలూ అపారమైనవి."

అంటూ ఒక సిద్ధాంత వేత్తగా, ప్రవక్తగా రాగల శతాబ్దంలో పరిఢవిల్ల వలసిన భాషాశక్తిని నిశ్శంకగా వక్కాణించారు. 1910తర్వాత వచ్చిన సమస్త సాహిత్యాన్నీ వ్యావహారిక భాషే పాలించగల ఋజుమార్గం దర్శింపజేసారు. ఒకడు కోరినా కోరక పోయినా వ్యావహారిక భాషను శిరసావహించక తప్పని స్థితిని ఆయనే కల్పించాడు.

భాషతోపాటు పాత ఛందస్సులలో కొత్త భావాలు ప్రచలితం కావడం అసంగతమనీ ప్రజలదైన అనూన గేయ ఫణితిని స్వీకరించి సంస్కరించి ముత్యాల సరమనే జనతా ఛందస్సును రూపొందించాడు. గురజాడ ఉదాహరణ మాత్రాలైన ఉత్తమ కవితలను అందించాడు. గణబద్ధ ఛందస్సులకు మారుగా మాత్రాబద్ధ ఛందస్సుల గుణ ప్రధాన కవితలను గౌరవించాడు. యతి ప్రాసల మేకు బందీల కోసం- చెప్పదల్చిన భావం నానావక్ర మార్గాలూ తిరిగే శృంఖలాలను విచ్ఛిన్నం చేసి గురజాడ యుగకర్త కాగలిగాడు.

రాయప్రోలు- గురజాడ అడుగుజాడలలో నడిచి ఎన్నో ముత్యాల సరాలు రచించారు. కొద్ది మాత్రల మార్పులతోనూ మరికొన్ని గేయాలు రచించారు. ముత్యాలసరం రచించినంత మాత్రం గురజాడ ప్రభావం అనడం న్యాయమా? నన్నయ్య గారికన్న ముందునుంచీ పద్య ఛందస్సులను కవులంతా స్వీకరిస్తూనే వున్నారు కదా? అనే ప్రశ్నలుత్పన్నం కాకపోవు. ముత్యాల సరాల రచనలో రాయప్రోలు మాత్రం అలాంటి సంశయాలకు తావులేకుండా- గురజాడను సన్నిహితంగా అనుసరించాడు. అడుగడుగునా ఆయన మార్గదర్శకత్వాన్ని అంగీకరించాడు.

ముఖ్యంగా రాయప్రోలు రచించిన "సంక్రాంతి సంబరము" లనే కవిత క్షుణ్ణంగా చదివితే చాలు రచనాశిల్పంలో గురజాడ ముద్రలెన్నో పోల్చుకోవచ్చు. కాని ఆత్మపదార్థంలో మాత్రం- తనదైన వ్యక్తి వాదమే ప్రచలితమైంది. సంప్రదాయ విశ్వాసాలే ప్రసారితమయ్యాయి. కాని కవి ప్రమేయం లేకుండానే జీవన వాస్తవికత ప్రవేశిస్తూనే ఉంటుంది.

**"పాలు తీసిన పొదుగులట్టుల**
**వాల బడి సంక్రాతి మబ్బుల**
**మంచు పడు హేమంత రాత్రుల**
**జతలు పాయువు పక్షులున్!"**

మౌలికంగా ఒక కవి హృదయంలో ఒక స్వచ్ఛరూపాన్ని అమర్చుకొని, వెలువడినంత మనోజ్ఞంగా అనుకర్తల రచనలు భాసించవు. ఒక్కోప్పుడు మార్గదర్శక కవిపాట్లు అవగతం చేసుకుని అతనిని మించిన ఉపజ్ఞకూడా ప్రదర్శితం కాగలదు! కాని రాయప్రోలు యీ కవితలో కృతకమైన పలుకుబళ్ళను పరిహరించలేకపోయారు. "వాలబడె సంక్రాతి మబ్బులు" అనడం తెలుగు నుడికారానికి కనీసం సమీపవర్తి కూడా కాదు! 'వాలినవి సంక్రాతి మబ్బులు' అని సవరించుకోవచ్చు! కవిత మరింత హృదయంగమం కావడానికి కవి స్వీకరించే శ్రద్ధ ప్రధాన పాత్ర వహిస్తుంది! మరోసారీ, మరోసారీ కవితను పునర్నిర్మించడంలో గురజాడ జాగరూకతను రాయప్రోలు గ్రహించలేక పోయారు.

**బూజు దులిపిన పూరి ఇండ్లను**
**వెల్ల వేసిన వీధి గోడలు**
**అలికి ముగ్గులనిడినఅరుగులు**
**అందగించెను పల్లెలన్!**

ఈ పద్యంలో ప్రాసను పాటించలేదు. కేవల స్వభావోక్తి ఎంతో రమణీయ దృశ్యాన్ని కన్నుల ముందుకు తేగలుగుతుంది. యతిని పాటించలేదు. దానివల్ల ఈ పద్యంలో అందం కొరవడిందా? అంటే అదీలేదు. కాని గురజాడ ఎంతో ఉదాత్తభావం చెబుతూనే శిల్ప సూత్రాలను పాటించడం విస్మరించరు. ఆయన ముత్యాల సరాలనుంచి ఎన్నయినా ఉదాహరణలుగా చూపవచ్చు. ముఖ్యంగా పూర్ణమ్మ, లవణ రాజు కలలు రెండూ అపరంజితో చెక్కిన బొమ్మలు!

**"తూర్పుబలబల తెల్లవారెను**
**తోకచుక్కయు వేగుచుక్కయు**
**ఒడయుడౌ వేవెలుగు కొలువుకు**
**వెడలి మెరిసిరి మిన్నువీధిని"**

ఒక పద్యానికి అదనపుశక్తి- ఉదాత్త సౌందర్యమూ సమకూరడం శిల్ప సంధానం వల్లనే! భావనలో మరింత ఉదాత్తత సమకూరుతుందనుకున్నప్పుడు తప్ప గురజాడ సంస్కృత సమాసాల జోలికి పోడు. పై పద్యంలో దట్టంగా ఆవరించుకున్న చీకటి చెల్లా చెదురైపోయేట్లు- తూరుపు బలబల లాడుతూ, తెల్లబడింది. ఆకసవీధిలో సంచరిస్తున్న తోకచుక్కను చూసి వెర్రి ప్రజలు జడుసుకుంటున్నారు. ఎన్నో అరిష్టాలు తేగలదీ ధూమ కేతువని భ్రమిస్తున్నారు. కాని తెల్లవారేసరికి తోకచుక్కా, వేగుచుక్కా కలిసి సూర్యుని కొలువుకు వెడలిపోయాయి. ఇవి సౌరకుటుంబానికి చెందినవన్న స్పృహ మహాకవికుంది. ఒడయుడు అనే అచ్చ తెనుగు పదానికి ప్రభువని అర్థం. వే వెలుగు అనే తెలుగు పదానికర్థం సూర్యుడనే!

**"తెల్లవారగ మేలు కొలుపులు**
**పాడుచును హరిదాసు లాడగ**
**గొంతులెత్తి శకుంతములు**
**నందమున శ్రుతి కలుపున్-"**

అని రాయప్రోలు సంక్రాంతి సంబరాలను వర్ణించాడు. మొదటి మూడు పాదాల్లోనూ లోక యథార్థాన్ని వివరించాడు. విశిష్టార్థాలు గాని ఉత్ప్రేక్షలుగాని నిక్షిప్తం కాలేదు. ఆ తెల్లవారడాన్ని వినూత్న జీవనోజ్జృంభణంగా చిత్రించలేదు. చివరి పాదంలో శకుంతములు

శ్రుతులు కలపడంలో వుంది, సొగసంతా! మిగిలినదంతా స్వభావోక్తే! కవి హృదయం కనుగొన్నది కాదు. ఉన్నదే!

తరువాత పద్యంలో కవితా గంధం సాంద్రంగా అలముకున్నది-

**నవ్యకేసర కపిశ శోభల**
**చేలు పసుపాడిన విధంబున**
**చూడకన్నుల వేడుకాయెను**
**భూమి గంధము చల్లగా!**

అంటూ, చల్లగా ఉల్లంఝుల్లనగా వర్ణించాడు కవి. కొత్త వరిపంట పసుపు రంగు మీరి ఎఱ్ఱడాలు సంతరించుకుంటోంది. పసుపాడినట్లున్నది. ఒళ్ళంతా కస్తూరి పసుపు అలదుకొని నలుచుకొని స్నానం చేసిన ఐదువరాలువలె మెరుస్తోంది పంటచేను! తెలుగింటి శోభను తెలుగు పొలాలకు పాటించడం రమ్యోక్తి!

ప్రొద్దు పొడుపే మంచి గుమ్మడిపండు పళ్ళెంలో పెట్టినట్లుంది. పూలు అమర్చి గొబ్బెమ్మల పూజకు సంసిద్ద మవుతోంది. "నవ్య ధాన్య సువాసనలతో, కడుపునిండా కుడిచి హాయిగ-" అనే రెండు ముత్యాల సరాలూ- కలిమిగల లోగిళ్ళ నవ్య ధాన్య శోభలు పాలునిండిన కడవలు, కడుపునిండా కుడవడాలూ వంటి సుందరానుభవాలు కలిమిగలవారి జరుగుబాట్లు. సార్వజనీనాలు కావు.

**"తలకు తాకును తలపులేవో**
**మదిని కదుపును మనసులేవో**
**గతము రా దాగతము తెలియదు**
**నేటి శుభములె మనకగున్!"**

అంటూ ఒక సన్నని విషాద తంత్రి మ్రోగిస్తారు కవి! ఎంత వేడుకున్నా గతం రాదు. కళ్ళింతలు చేసుకుని ఎంతగా పరికించినా ఆగత స్వరూపమూ తెలివిడి పడదు. కనుక నేటి శుభములూ కూడా రేపటికి మనకబారుతాయేమో! ఆచింత పాటవెనుక శ్రుతిలా అందరి మనసులోనూ మ్రోగుతూనే వుంటుంది. ఇది సార్వజనీనమే!

కొత్త బియ్యపు పొంగలి నైవేద్యాలు పెట్టుకున్నారు. సంక్రాతి సంబరాలకు కవి హృద్యంగా మంగళాంతం పలుకుతాడు.

**మంగళము సంక్రాతి సామికి**
**మంగళము మా భోగిసామికి**
**మంగళము మన మాతృభూమికి**
**మంగళం బందరికిన్!**

శుభప్రదమైన ఒక పర్వం గడిచిన తర్వాత స్వస్తి పలకడము ఆర్షవిధి. దానినే మాతృభూమికి మంగళం చెప్పారు రాయప్రోలు!

రాయప్రోలు సుబ్బారావు- గురజాడ అప్పారావు కన్న ముప్పయి సంవత్సరాలు చిన్నవాడు. చారిత్రకంగా చూసినా గురజాడతో సమానంగా ఆచారత్వం పొందగల త్రాణలేదు.

1910 తర్వాత గొంతెత్తిన కవులందరూ- విశ్వనాథ సత్యనారాయణ గాని, రాయప్రోలు కాని, గురజాడ మార్గదర్శకత్వంలో ముత్యాల సరాలను ఓహరిసాహరిగా రచించినవారే! గురజాడకు నివాళులర్పించినవారే!

**విశ్వనాథపై గురజాడ ప్రభావం:**

నవ్య కవితాశ్రేణిలో అత్యంత నవీనత్వానికి పితృపాదులు గురజాడ అప్పారావే! ఈ విసూత్న భావనాశక్తి మౌలికంగా త్రిగుణాత్మకమైనది. (1) సమాజ వాస్తవికతా ప్రదర్శనం (2) మూఢాచార తిరస్కారం. (3) సమాజ పునర్నిర్మాణోత్సేకం.

కృష్ణశాస్త్రి పదేపదే ఒకమాట చెప్పేవారు "గురజాడ 1915లో మరణించినా- 1915నుంచే ఆయన జీవించనారంభించారు'' అని. గురజాడ భౌతికంగా జీవించింది 56ఏళ్ళే. అందులో అచ్చంగా సాహిత్య కృషి జరిపింది ఎంత ఉదారంగా లెక్కవేసినా పదేళ్లకు మించదు. కాని, ఆ ఒక్క దశాబ్ది కృషి మాత్రం ఇరవయ్యో శతాబ్దినంతటినీ వెలిగించింది. మళ్ళించింది. నిర్మించింది. ఆగామికాలాన్ని సైతం తన ప్రభావంతో పురోగమింప చేస్తుంది. గురజాడ తనకీర్తి శరీరంతో జీవించ నారంభించిన మొదటి దశలో కొద్దిమంది సాహసులు మాత్రమే అనుయాయులయ్యారు. ముందంజవేశారు.

అనూన వారసత్వ సంపద గల జానపద సాహిత్యంలోని జీవనాడిని పట్టుకున్నవాడు ఆయనే. ఆయన ప్రయుక్తం చేసిన గేయమార్గాన్ని దాదాపు భా.ఎకవులంతా అనుసరించిన వారే! రాజమండ్రిలో ప్రిన్స్‌పాల్ కూల్ట్రే దొర శిష్యులుగా ప్రోత్సాహం పొంది అడివి బాపిరాజు, కవి కొండల వెంకట్రావు గేయరచనా మార్గంలో చేరారు.

గురజాడ నిర్మించిన కథనగేయ పద్ధతిని స్వీకరించి విశ్వనాథ సత్యనారాయణ గురజాడ ప్రభావాన్ని పుంజీభవింపచేసుకుని మనోజ్ఞ కావ్యాలు నిర్మించారన్న సత్యాన్ని అందరూ విస్మరిస్తున్నారు. ముత్యాల సరాన్ని యథాతథంగా స్వీకరించి కోకిలమ్మపెళ్ళి అనే సంపూర్ణకావ్యం రచించారు. గురజాడ చూపిన కథన కౌశలం లోని మెళకువలన్నీ స్వీకరించి, పెంచి పోషించారు. ఆయన చూపిన గేయరీతిలోని కొద్ది మార్పులతో కిన్నెరసాని పాటలు రచించారు. పూర్ణమ్మ కథలోని ప్రధాన జీవవాహిని వలెనే ఈ రెండు కావ్యాలలో ప్రధానరసం కరుణ. ఈ కావ్యద్వయి ఏకగ్రథంగా 1926లో ముద్రణ

పొందింది. ఆ సంగతులన్నీ ఆకాశవాణి విజయవాడ కేంద్రం భద్రపరిచిన విశ్వనాథ వారి స్వీయగానం రికార్డులో వివరించబడింది.

పూర్ణమ్మ కావ్యాంతంలో ఆమె తనువు చాలించిన విషాదాంతాన్ని గురజాడ వాచ్యం చేయకుండా చమత్కారంగా వర్ణించారు. ఆ విధంగానే కిన్నెరసాని జీవితాంతాన్ని విశ్వనాథ కూడా చమత్కారంగానే వర్ణించారు. కిన్నెరసాని కరుణాశీలి కనుక అత్తఆరళ్ళు భరించలేక నీరై ప్రవహించి గోదావరి సన్నిధిలో తలదాచుకుంది. భర్త ఆస్థితికి కొయ్యైపోయాడు. ఈ రెండు కావ్యాలూ ప్రతీకాత్మకమైనవి. తెలుగు ఆడపడుచైన కోకిలమ్మను గీర్వాణ భాషా ధాష్టీకంతో చిలుక పొడుచుకు తింటుంది. ఒక యథార్థ విషయాన్ని అన్యాపదేశంగా కథంనం చేశారు విశ్వనాథ. ఈ కావ్యాలు ఆధునిక భావనా సారళ్యతకు ఎన్నో వన్నెలు కూర్చాయి. తెలుగు తనాన్ని ప్రతిబింబించాయి. వాతావరణ మాధుర్యాన్ని చిత్రించాయి. ఇతివృత్తానికి అన్నివిధాలా అనుకూలమైన ముత్యాలసరాన్నే స్వీకరించి ఔచిత్యం ప్రదర్శించారు విశ్వనాథ సత్యనారాయణ.

# గురజాడ నుండి నేటివరకు ఆధునిక కవిత్వంలో అవిచారమూలకాలూ, అపభ్రంశాలూ

డాక్టర్ ఆర్వీయస్ సుందరం గారు నాకు ఆత్మీయ మిత్రులు. వారివ్యాసం 7.4.1994వ తేదీ విశాలాంధ్ర గురువారం సాహిత్యానుబంధంలో నన్నాకర్షించింది. ఆ వ్యాసంలో నాకు అభ్యంతరంగా తోచిన విషయాలను కొన్నిటినే ప్రస్తావిస్తాను. అదిన్నీ మైత్రీ ధర్మంగానే!

'గురజాడ నేటి వరకూ ఆధునిక కవిత అనడంలోనే ఒక తిరుగుడుంది. మన విశ్వ విద్యాలయాల ఆచార్యులంతా 'ఆధునిక' పదాన్ని కేవలం కాలవాచిగానే పరిగణిస్తున్నారు. ఇరవయ్యో శతాబ్దంలో వచ్చిన సర్వసాహిత్యమూ ఆధునిక మేనని భ్రమిస్తున్నారు.

ఇంగ్లీషు సాహిత్యంలో కూడా 1910లోనే ఆధునిక సాహిత్యం లక్ష్యలక్షణ సమన్వితంగా ప్రాదుర్భవించిందని విదుషీమణి వర్జీనియా ఊల్ఫ్ నిర్ణయించింది. ఆధునిక పదానికి నిర్వచనమూ ఇచ్చింది. గతాను గతిక, సంప్రదాయ వాదంగాని, మత ప్రభావంగాని తిరోగమన శీలంగాని సాహిత్యంలో ఆధునికం కావని తిరస్కరించింది.

చార్లెస్ డార్విన్ జీవపరిణామ సిద్ధాంతం వెలువడి భగవత్ సృష్టిని పరాస్తం చేసింది. కారల్‌మార్క్స్ ఆర్థిక సాంఘిక సిద్ధాంతం వెల్లడైన తర్వాత సంపదాదారిద్ర్యమూ, భగవంతుని ఏర్పాట్లో పూర్వజన్మ పుణ్యపాప సంచితాలో కావని, మూర్ఖ విశ్వాసాలన్నిటినీ నిరసించింది. సిగ్మండ్ ఫ్రాయిడ్ మనస్తత్వ శాస్త్రం ఆవిష్కరింపబడ్డాక మానవుని మనస్సుకీ, దాని ఉనికికీ, పెరుగుదలకీ, రుగ్మతలకీ కారణాలున్నాయని నిర్ణయించింది. పూనకాలు, దయ్యం పట్టడం, అతీత శక్తులూ వంతటి మూఢ విశ్వాసాలను తిరస్కరించింది. ఆల్బర్ట్ అయిన్ స్టయిన్ సాపేక్ష సిద్ధాంతంతో కాల దూరాల నడుమ గల వ్యత్యాసం- మనిషి పరిష్కార పరిధిలోనికి వచ్చింది. ఈ నాలుగూ ఆధునిక శాస్త్రీయ ప్రభావమూ మానవజీవన విధానంపై, ఆలోచనలపై, కళలపై సాహిత్యంపై ప్రభావం ఎంతగానో కలిగించాయి.

ఈ వినూత్న వివేచనా ప్రధాన సాహిత్యమే ఆధునిక సాహిత్యమవుతుంది తప్ప సాంప్రదాయక విశ్వాసాలతో సాగే ఏ కళాప్రక్రియా ఆధునికం కాబోదని స్టీఫెన్ స్పెండర్ మహాకవి నిర్వచించాడు. కనక ఆధునిక పథం కాలవాచి కానేకాదు. విస్పష్ట గుణవాచి మాత్రమే. ఈ విషయాన్ని నేనూ, నా కవి మిత్రుడు రమణారెడ్డి మూడు దశాబ్దాలుగా

వివరిస్తూనే ఉన్నాం. ఐనా అకాడమిక్ విమర్శనా సంప్రదాయ వాదులు బిగించుకున్న దృఢాభిప్రాయాల అయోమయ పీఠాల నుంచి కదలరు. ఇరవయ్యో శతాబ్ది సాహిత్యమంతా వివేచనా రహితంగా ఆధునికమేనని వాదిస్తారు. కులమతాలనూ, మూఢ విశ్వాసాలనూ నిశ్శంకగా తిరస్కరించిన గురజాడనీ, వర్ణాశ్రమ ధర్మాల మనుశాశనాలకు ఆధునిక సమాజాన్ని తిరోగమింప చేయాలని ఆమరణాంతం ఆరాటపడిన విశ్వనాథ సత్యనారాయణనీ ఒకే గాటకు కట్టేస్తుంటారు.

ఈ సిద్ధాంతాన్ని ఇటీవల జాతీయ సాహిత్య పరిషత్ రచయితలూ, బి.జె.పి వంటి పునరుద్ధరణ వాదులూ తిరగతోడుతున్నారు. ఆలోచనా కాలుష్యం ద్వారా కంగాళీ కలిగిస్తున్నారు. ఆ వెర్రి ధోరణిలోనే నా మిత్రులు ఆర్వీయస్ అనాలోచితంగా పడిపోవడం విచారకరం!

ఆయన వ్యాసారంభ వాక్యమే అవగాహనా లోపాన్ని స్థాపించింది. "ఇరవయ్యో శతాబ్దంలో వచ్చిన తెలుగు కవితనే మనం ఆధునిక కవితగా చెప్పుకుంటున్నాం" అనితన నమ్మకాన్ని సర్వామోదకరంగా భ్రమిస్తున్నారు. తద్వారా వ్యాసమంతా దురవగాహనా దుమారంలో కొట్టుకుపోయింది. లోతుగా ఆలోచించాలని సంకల్పిస్తూనే లోతులేని ఉపరితల స్పర్శలతో పెడమార్గంలో సాగిపోయింది.

ఆహారోత్పత్తి క్రమంలోనే శ్రామిక ప్రజలే భాషనూ రూపొందించారు. దానినే క్షాళనం చేసి కవులు నిక్షిప్తం చేస్తారు. భద్రపరుస్తారు. కనక ఏ భాషా ఒక శుభరాత్రి మారిపోదు. పైగా వెయ్యేళ్ళ ఛాందస వాదులు ప్రజల భాషను తిరస్కరించి పండితుల భాష అనే ఇనుపగూటిలో తల దాచుకున్నారు. విస్పష్ట పరిణామాలు అరికట్టబడ్డాయి.

గురజాడ ప్రతిపాదించిన పంచశీలాలలోంచే భావ కవిత ఉద్భూతమైంది. అదిన్నీ ఆయన మానసపుత్రుడు బసవరాజు అప్పారావే సింహద్వారం తెరిచాడు. సంఘసంస్కరణ భావాలకు సమాంతరంగానే స్త్రీకి గౌరవనీయస్థానం కల్పించింది భావకవిత్వం. గురజాడకు ఎందులోనూ సమ ఉజ్జీగా నిలవని రాయప్రోలును తలకెక్కించడంలోనూ విశ్వవిద్యాలయ పండితులే కుట్ర పన్నారు. తెలిసో తెలియకో ఆర్వీయస్ వంటి వారనేకులు ఆఝుంఝూటంలోనే పడి కొట్టుకు పోతున్నారు.

........... "మళ్ళీ కొంతకాలానికి అవతరించిన అభ్యుదయ కవితాపథంలో గురజాడ ప్రేరణకు చోటివ్వడానికి తంటాలు పడటం చూస్తున్నాం" అని ఒక భయంకర ఆరోపణ అభ్యుదయ వాదులపై చేయడం క్షంతవ్యం కాదు. మన వెయ్యేళ్ళ సాహిత్యంలో విసర్జించ వలసినవీ, పరిగ్రహించగలిగినవీ కలగలిసి ఉన్నాయి. స్వీకరించవలసిన జీవన వారసత్వాలను అభ్యుదయ వాదులం ఎన్నడూ తిరస్కరించలేదు. అభ్యుదయోద్యమ నాయకులు మద్దుకూరి చంద్ర శేఖరరావుగాని, తుమ్మల వెంకట రామయ్యగాని, పులుపుల వెంకట శివయ్యగాని, అలాంటి ధోరణులెక్కడ పొడసూపినా ఉదాసీనత వహించలేదు.

ఆనాటి ప్రజల భాషను ప్రయుక్తం చేసిన అన్నమయ్యగాని, తిక్కన్న గాని, భాషాపరంగా అభ్యుదయ కవులకు శిరోధార్యాలే! వేమన యోగి కాలంతో నిమిత్తం లేని ఆధునిక కవీ, అభ్యుదయ ప్రవక్తాను. ఇక గురజాడ సాక్షాత్తూ ముప్పయేళ్ళ ముందే అభ్యుదయ కవిగా పుట్టిన ఆధునిక క్రాంత దర్శి! కనక తంటాలు పడటం అభ్యుదయ వాదులు తెచ్చుకున్న గ్లానికాదు. ఆయన్ని అన్ని విధాలా కాలదోషానికి గురి చేద్దామని తలక్రిందులా ప్రయత్నిస్తున్న వాళ్ళే తంటాలు పడుతున్నారు. తిరోగమన వాదులూ, పునరుద్ధరణ వాదులూ ఆయన్ని ఇదివరకే కవి కాదన్నారు. ప్రస్తుతం నాటక కర్త కూడా కాదని విషప్రయోగాలు చేస్తున్నారు.

ఆర్వీయస్ నేనెరిగినంత వరకూ అభివృద్ధి నిరోధక వాదికాదు. కాని అకాడమిక్ విమర్శల పెద్దమనిషి తరహా కోసం- 'రామా స్వస్తి, రావణా స్వస్తి' థియరీ ప్రయోగిస్తున్నారు. వెస్టెడ్ ఇంటరెస్టు గల ప్రతీపవాదుల కుట్రలో అమాయకంగా పడిపోతున్నారు. ఉచితానుచితాలు పాపం మరచి పోతున్నారు అంతవరకే నాఅభ్యంతరం!

భావకవిత్వం అనే పదాన్ని విశ్వకవి రవీంద్రులే సృజించారు. దాన్నే తెలుగువారు స్వీకరించారు. పూర్వ కవిత్వంలో దేవతలూ, పితృదేవతలూ ప్రధాన వస్తువుగా నిలిచేవారు. వర్తమాన ప్రజా హృదయ స్పందన వినిపించేది కాదు. ఆ దుష్ట సాంప్రదాయాన్ని బ్రేక్ చేసి సమకాలీన ప్రజల ప్రతినిధిగా కవి, సామాజిక మనోభావాలనే కవితకు ఇతివృత్తం చేసుకున్నాడు. భావమే ప్రధానంగా కల కవితనే భావకవిత అని రవీంద్రులే నిర్ణయించారు. బహుశా ఈ సత్యం గుర్తించకనే ఆర్వీయస్ "మరే భాషలోనూ ఉన్నట్లు కనిపించదు." అనే పాసివ్ రిమార్కుతో దుస్సాహసం చేసి తృప్తి పడ్డారు. దానికి మరో పేరు పెట్టాలనే తపన లేదంటూనే కొత్త పేరు సూచించడానికి ప్రయత్నించారు. నవోదయ కవిత్వం అంటే సర్వోదయోద్యమంలా ఎంత అయోమయంగా ఉందో వారు ఆలోచించలేక పోయారు. వారు పెట్టిన రెండుపేర్లూ అసంగతాలే! (అసలీయన ఎవరు పేరు పెట్టడానికి?!)

గురజాడ సమున్నత స్థానానికి రాయప్రోలు సమీపస్తులు కూడా కాలేరు. ఆయన కూడా గొప్పకవి కావడం వేరే సంగతి. కాని తెలంగాణా ప్రజలు జీవన్మరణ పోరాటం జరుపుతున్నప్పుడు ఈ మహానుభావుడు నైజాం పాదుషాని స్తుతిస్తూ 'ఆదర్శ ప్రభువు' అని కీర్తిస్తూ తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ గ్రంథం ప్రచురించాడు. అలాంటి రాయప్రోలు గురజాడ నిలచిన చోట నిలవడానికైనా అర్హుడుకాడు. ఇక స్థానం కల్పించడం అనే సమస్యే పుట్టదు. వారివురూ ఒకే నాణానికి ఇరు పార్శ్వాలుగా కనిపించడం హ్రస్వదృష్టి! లేదా నేత్ర కుసుమావరోధమైనా కావచ్చు. తాత్త్విక చింతన విసర్జించి చేసే సాహిత్య సమాలోచనల వైఖరులిలాగే అసంబద్ధంగా ఉంటాయి.

రాయప్రోలు గురించి ఆర్వియస్ తెలిపిన అభిప్రాయాలన్నీ ఖండన ప్రాయాలే అయినా వాటికి ప్రాధాన్యత యివ్వదలచడం లేదు. 'రాయప్రోలు వెళ్ళిన లోతులకు గురజాడ వెళ్ళి ఉండకపోవచ్చు' నన్న వారి ఆలోచన మాత్రం తీవ్రంగా అభిశంసనీయమే!

ఆయన ప్రచ్ఛన్న ప్రతీపవాది! జాతీయ వాదిగా షోవెనిజంను ఆరాధించిన అపరాధి. 'ఎల్ల లోకములొక్క ఇల్లు' కావాలన్న సుదూర దర్శనకల ప్రథమ అంతర్జాతీయ వాది గురజాడ. అట్టి వారిద్దరినీ ఒకే నాణానికి రెండు పార్శ్వాలని నిర్ణయించే వారి మనీష శోచనీయం కాక మరేమవుతుంది?

కృష్ణశాస్త్రి గురించీ, శ్రీ శ్రీ గురించీ బహుజనాభిప్రాయాలను పునరుద్ఘాటించడానికి విశ్వవిద్యాలయాచార్యులే అక్కరలేదు. ఆధునికత గుణ ప్రధానమైనది. కాని అందులో శ్రామిక వర్గ చైతన్యానికి ప్రత్యేక స్థానంలేదు. అభ్యుదయ కవితాపథం శ్రామిక వర్గ శ్రేయోదాయకమే! శ్రామిక వర్గానుకూల భావధారకూ, అప్పటికి చెలామణీలో ఉన్న బూతు సాహిత్యానికీ జన్మించిన వికృత శిశువుగా దిగంబర కవిత్వం ముందుకు వచ్చింది. గోర్కీ మహాశయుడు చెప్పినట్లు Beastiality-Ferosity తో కవిత్వపదార్థం నింపింది. అచిరకాలంలోనే కాలధర్మం చెంది, దురదృష్టావశాత్తూ విరసం పుట్టుకకు దారి తీసింది. ఈ వికలాంగ కవిత్వం కృషి సల్పడం వల్లనే విరసం చరిత్ర ఎన్ని వంకర్లో తిరిగింది. అభ్యుదయ కవితోద్యమం అందుకున్న శ్రామిక వర్గ చైతన్యానికి మానసిక శిశువులే విరసంగాని, స్త్రీ వాదంగాని, నేడు ప్రచలితమవుతున్న దళితవాద కవిత్వంగాని- అభ్యుదయ కవిత్వమే ప్రథమంగా శృంఖలా విచ్ఛేదం చేసింది. కవుల ఆలోచనలకున్న సంకెళ్ళను పటాపంచలు చేసింది. కవిత్వం పలచబడడం వగైరా ఆరోపణలు పూర్తిగా తెలిసి చేసినవి కావు. స్వీయ మూఢవిశ్వాసాల ఫలితాలే! సవిమర్శకంగానూ క్షుణ్ణంగానూ చదవని గాలిచాటు కబుర్లిలాగే ఉంటాయి. శేషేంద్ర 1974లో రచించిన మండేసూర్యుడు, నాదేశం నాప్రజలు వంటి కావ్యాలలో విప్లవ ధోరణి ఉన్నా, అది భద్రలోకం కలిగించిన వైయక్తిక విప్లవ ధోరణే తప్ప విప్లవ శక్తులతో ప్రాణం పంచుకున్నది కాదు. పైగా వస్తువుకన్న శిల్పానికే ప్రాధాన్యత ఇచ్చిన పెడవాదంగా త్వరలోనే ధ్రువ పరుచుకుంది.

అతని వ్యక్తి వాదమే అతనిచేత అతనిత్కృష్ట జుగుప్సాకర నవల 'కామోత్సవ' రచించే శక్తిని కలిగించింది. నిజమైన సామాజిక విప్లవ దర్శన ఉన్న ఏ కవీ అశ్లీల ఆకర్షణలకులోనై అంత నీచంగా పతనం చెందడు. పురాణం సుబ్రమణ్యశర్మ వంటి వారి శిష్యుడయ్యే వాడూ కాదు.

ఏమైనా ఎన్నో అభ్యంతరకర విషయాలు రాసినా- నన్ను ఆలోచింపజేసిన నా మిత్రులు ఆచార్య శ్రీ ఆర్వీయస్‌కు అభివాదాలు! అనంతర భాగంలో సాగిన అనంత అసంగతాభిప్రాయాల గురించి నేనీ వ్యాసంలో ప్రతిస్పందించదలచలేదు. వ్యాస విస్తరణ భీతే దానికి కారణం. ఉత్తరోత్తరా రచించతలచిన అభ్యుదయ కవిత్వం చరిత్రలో చర్చించనూ గలను.

అంతవరకూ నా మిత్రులు సుందరంగారు ఓపిక పట్టగలరని విశ్వసిస్తాను.

**(5-5-1994 విశాలాంధ్ర)**